శ్రీ

# బలజా సౌభద్రీయము.



అను నీ తెలుగు నాటకము.

గోదావరితీరవిశ్వాసరాయపుర

వాస్తవ్యుఁడగు

కస్తూరిశివశంకరకవిచే

రచియింపఁబడియె.



మొదటికూర్పు ప్రతులు 10

ఏలూరు.

సత్తిరాజు సీతారామయ్యగారి

దేశోపకారిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.





1903 సం॥

వెల 0-8-0

# పీఠిక.

---

పండితకవులార! నేనీనాటకమాటలకై మిక్కిలిచిన్నతనములో రచియించినదగుటచేతను ఇదియేప్రథమకృత్యమగుటచేతను ఇందచ్చటచ్చట తప్పులుదుప్పులుగా నున్నవి. కనుక నేదీనిని ముద్రించక చిరకాలమునుంచి యుపేక్షఁజేసితిని. కాని, నాస్నేహితులు కొందఱుపండితులు దీనినప్పుడప్పుడు చూచి యిదిప్రయోగమునకు సులభసాధ్యముగా నుండుననియు ముద్రింపవలయుననియు నన్నుఁ బ్రోత్సాహపఱచినందున నేనిప్పటికీ నాటకమును ముద్రింపించితిని. మఱియు నీనాటకమునఁ బ్రస్తావనలో మొగలితుర్తి పురాధీశ్వరుఁడగు శ్రీకలిదిండి దైవప్రసాద కుమారలక్ష్మీనృసింహరాజుగారిని సభానాథునిగా వర్ణించినాడను. ప్రబంధములలో నేకాని నాటకములలో నీమార్గమిదివఱకెవ్వరునవలంబించియుండలేదు. ఇదిరమ్యముగా నుండునేమోయని యీక్రొత్తత్రోవను వ్రాసితిని కృష్ణమిశ్రవిరచిత ప్రబోధచంద్రోదయ సంస్కృతనాటకమునఁ గీర్తివర్మదేవుఁడిట్లే సభానాథుఁడుగా వర్ణింపఁబడినాఁడు పండితులిందలి మత్కృతములగుదోషములనుగ్రహించినాకుఁదెలియజేసితిరేని వందనపూర్వకముగా నందికొని ముందుముద్రణమున సవరింపుకొనెదను.

21-12-1908
విశ్వాసరాయపురము

ఇట్లువిధేయుఁడు
కస్తూరిశివశంకరకవి.

# ఈనాటకమునందువచ్చుపాత్రములు.

---

పురుషులు.

బలరాముఁడు

శ్రీకృష్ణుఁడు.

సాత్యకి

అభిమన్యుఁడు. కథానాయకుఁడు ( బలరాముని మేనల్లుఁడు )

కరిబలుఁడు. } ఘటోత్కచపరిచారకులు.
పింగళుఁడు.

ఘటోత్కచుఁడు. భీమునికొడుకు ( రాక్షసుఁడు )

దేవేంద్రుఁడు.

బృహస్పతి.

నారదుఁడు.

దుర్యోధనుఁడు.

లక్ష్మణుఁడు. దుర్యోధనునికొడుకు. శశిరేఖను బెండ్లాడవచ్చినవాఁడు.

కర్ణుఁడు.

వామనభట్టు.

సదాశివుఁడు } బలరామునిపురోహితులు

జ్యోష్సి

విప్రులు మొదలైనమఱికొందఱు

స్త్రీలు.

రేవతి - బలరామునిభార్య

సత్యభామ - కృష్ణునిభార్య

సుభద్ర - బలరామునితోడఁబుట్టినపడుచు - అభిమన్యునితల్లి

శశిరేఖ - బలరామునికూఁతురు - కథానాయిక

శీలవతి-చంద్రముఖి-సరసవచన - మధురవాణి -నని లేఖసఖులు

త్వరగతి - చంద్రిక - సీమంతిని - చేటికలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 13 | కుటింబిని | కుటుంబిని |
| 2 | 27 | చందిరాయితుడీశ దైవప్రసాద | చందిరాయిత దైవప్రసాద |
| ,, | 19 | తారముగ | తారము |
| 3 | 19 | వినీరసంబులటు | వినీరసంబులయి |
| 4 | 23 | రాజ్యము | రాజము |
| ,, | 25 | నీకుక్రమాగత | నీకులక్రమాగత |
| [illegible] | 9 | బందెలత్యోకుణా | బందె లైరినూ? |
| 8 | 13 | హాలోయుధ | హలాయుధ |
| 9 | 1 | దేశల | దేశముల |
| | 2 | రాజను | రాజరాజను |
| | 8 | పుత్రాదిరాజుల | పుత్రాదిచ్ఛేత్ప రాజయ |
| 10 | 23 | బలీయలు | బలీయులు |
| 11 | 24 | క్రమకారిణం | క్రమకారణం |
| 12 | 8 | తటాబ్ధిని | తటాబ్జిని |
| | 9 | ఇల | యిల |
| 13 | 6 | గేవల | కేవల |
| 17 | 6 | భిక్షుకుఁడైన | భిక్షుకుఁడైన |
| 18 | 25 | అర్కిలి | నర్కిలి |
| 20 | 10 | కాలకృత్యములు | కాల్యకృత్యములు |
| | 25 | మెల్లడించుచూన్నది | వెల్లడించుచున్నది |
| | 25 | కారణమోమి | కారణమేమి. |
| 21 | 21 | అభిమన్య | అభిమన్యుఁడ |
| 24 | 9 | ఇప్పుడీసంగతి | ఇప్పుడీసంగతివిని |
| 24 | 17 | గుణగ్రహాకురాలు | గుణగ్రహాకురాలు |
| — | | నీవనుగ్రహించ | నీవేగ్రహించ |
| 26 | 23 | పచరించి | పచరింపు |
| 27 | 13 | ఏటాకుల | ఏడాకుల |
| 28 | 8 | బూను | బూని |
| | 13 | చిత్రైకాగ్రత | చిత్తైకాగ్రత |
| 30 | 8 | సరస | సరసవచన |
| 31 | 2 | పుత్రికలైన | పుత్రికవైన |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 7 | మరణశపరణము | మరణశరణము |
| | 17 | నెమ్మగము | నెమ్మొగము |
| 32 | 27 | ... ... ... ... ... | నన్నారకవిడిచి |
| 33 | 1 | మన్మథకు | మన్మథునకు |
| 38 | 23 | సి హాసనస్థ | సింహాసనస్థ |
| ... | ... | ... ... ... ... ... | తెరలో |
| 42 | 6 | రాజరాజసుపూజ్యరాజసన్మాన్య | ... ... ... ... ... |
| | 16 | అడుగుల | అడుగున |
| 45 | 8 | నారద విషయము | ... ... ... ... ... |
| 50 | 26 | సీరికి | వీరికి |
| 51 | 6 | పురోహితురాల | పురోహితులార |
| 52 | 19 | రామభోట్లు | రామభట్లు |
| 58 | 5 | శరణు | శరణము |
| 64 | 3 | నాకపీపాత్రే | నాకపపాత్రు |
| 66 | 7 | బల్లిగుండు | బల్లిదుండు |
| 69 | 7 | ద్వారకు | ద్వారకకు |
| 70 | 4 | నారదగురువర్య | గురువర్య |
| | 6 | నారదు | బృహస్పతి |
| 71 | 6 | రెయొల్లైనను | ... ... ... ... ... |
| | 17 | దల్లి | తల్లి |
| 72 | 17 | అయుత్తము | అయ్యుతము |

శ్రీ

# బలిజా సౌభద్రీయము.



## నాంది.

ఉ॥ శ్రీరమణీ ముఖాబ్జ మధుసేవన జాతమదాళి [illegible]

కార వచఃపరంపరలఁ గ్రాలెడు నామధుహారి మిమ్ము [illegible]

కారులఁ గానొనర్చుతఁ దగన్ మధుహారి మరం [illegible]

స్వారవచాతురిం బరుపు నన్యముఁ జేఁటిగఁ జేయు [illegible]

మఱియు;

ఉ॥ శ్రీనగజాసతీమణి విశేష తమాప్తతఁ గౌఁగలించు [illegible]

బూనిక నైక కూపెడలఁ బొంగుచనుంగవఁ [illegible]

కూన శశాంకుఁ గొట్టఁ జను శోకయుగంబని యెంచి [illegible]

గ్నానశశాంకునిం గరయుగంబునఁ జన్గవఁ బట్టి [illegible]

ర్వాణివిభుండు మిమ్ముల జరా మరణమ్ములఁ బాపి బ్రోవుత [illegible]

సూత్రధారుఁడు- (నాందియనంతరమున సభవైపు చెవియొగ్గి) [illegible]

చ్చినదివిన్నాను మీయాజ్ఞ యెట్లన్నటె! (తెరవంక [illegible])

ఓసికుటింబిని! మాట!

నటి- (ప్రవేశించి) ప్రాణనాయక! వచ్చితిని, ఏమిత [illegible]

సూత్ర- ప్రియురాల! సర్వలక్షణ, లక్షితమైన యీసభ చూచితివా? [illegible]

ద్యానైపుణీ ప్రఖ్యాతి తిరస్కారణపటువిశేష శేముషీ [illegible]

త్రులును, వేదవేదాంగాధ్యయన బోధాచరణప్రచార [illegible]

పురోహితులును—

నటి- ఆర్య! ఇంకమీదీర్ఘసమాసవర్ణనాప్రగల్భతఁ జాలింపుఁడు [illegible]

సూత్ర- సుమతులగు హితులునులోనుగాఁ గలిగియుప్పా [illegible]

మండల మండితాఖండ చంద్రుండునుం బోలి భాసిల్లుచు—

సీ॥ తనకీర్తి దిక్సతీధమ్మిల్ల సమితికిసరసంపు మల్లికాస్రక్కు గాఁగ।
ధనప్రతాపంబుమార్తాండ కాండాఖండచండిమో పాధ్యాయసరణిఁజూపఁ।
దనసుందరత్వము ధనదపుత్రాంగజగర్వంబు బూర్వపక్షంబు సేయఁ।
దనధైర్యసాహసదాతృ త్వగుణములు లలివిక్రమార్కునిఁదలఁపుదేఁగ।
లలితసింహాసనంబున వెలయుచుండె (ప్రేలితోఁజూపుచు)
వానిఁజూచితె! కల్దిండివంశవార్ధి-
చందిరాయితు దైవప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుని॥

నటి- (సభకలియఁజూచి) నాథ! లోకాలోకపర్వత పర్యంతపర్యటన పటువిశేషకీర్తి లలితుండగు నీమహాభాగు నెవ్వరెఱుంగరు?

సీ॥ ఎవ్వాని నామసంస్మృతి కవి శుక పికసంఘంబులకును వసంతబుతువో
యెవనివదాన్యత్వ మవిరతాగత యాచకాళి దారిద్ర్యపంకార్కఘృణియో
యేనిమృష్టాన్నప్రదానము దీనక్షుధాంబుదతతికిజంఝానిలంబో
యెవనిసుదర్శనమవనిసా శ్రితమనస్తాపనిశాటసుదర్శనంబో
అట్టికల్దిండివంశపయోంబురాశి
చందిరాయితుడీశదైవప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుఁడు
వసుధనాచంద్రతారముగవఱలుఁగాఁత॥

సీ॥ ఎవనిసౌందర్యవైభవమీజగతిఁబర్వఁ బంచబాణునిరూపుపంచతఁగనె
నెతనివాణీప్రసన్నతనుతి కెక్కంగబొమ్మదేవరపూజమూలవట్టె
నేనిసంపూర్ణలక్ష్మీనిరతాప్తిచే విష్ణుఁడక్కునటాయివెట్టికొనియె
నేవానితీక్ష్ణతకినుఁడోడి మతిచెడిదిరము లేకిటునటుఁదిరుగుచుండె
నట్టికల్దిండివంశపయోంబురాశి
చందిరాయితుడీశప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుఁడు
వసుధనాచంద్రతారముగవఱలుఁగాఁత॥

సూత్ర- ప్రేయసీ! ఆహా! ఆమహామహునివర్ణించుటచే నిప్పుడుగడా సున కవిత్వస్ఫ

క్షముఫలించినది చూడు.

మ॥ ధరణిం దేనికిఁ బూర్వజన్మకృతస చ్చారిత్రమే బీజమున్

వరవిజ్ఞానమె నూతనాంకురము పైవిద్వత్త్వంబె కాండంబు సుం

దరకావ్యంబె నవప్రవాళము సదర్థోక్తులే పూవులా

ధరణిం దత్కవితాద్రుమంబు విలసత్కల్దిండి లక్ష్మీనృసిం

హారపానాయకదివ్యశోభనగుణ వ్యాపారసద్వర్ణనా

వరసాఫల్యము నొందకున్న నకటా వంధ్యత్వముం బొందదే॥

నటి- (సంతోషముతో) చిత్తము సరే ఆయనను జూచినాను తరువాత.

సూత్ర- ఈ కేతకీకుసుమ పట్టణమున వేంచేసియున్న భగవంతుడగు శ్రీరామదేవునకిప్పు

డు కళ్యాణోత్సవవాసరములగుటనే తత్పురాధీశ్వరుఁడును సభానాథుఁడునైన

యీరాజోత్తమునిచే నిప్పుడిట్టులాజ్ఞాపించబడినాను.

నటి- (ససంభ్రమోత్సాహముగా) ఆర్య ఏమని?

సూత్ర- ఇదిగో వినుము. ఇట్లు, కుశీలవ!

గీ॥ కడఁగి యిప్పుడు కొందఱు కవులు పెక్కు

రూపకంబుల రచియించిరే పుమీఱఁ

లలితగంభీరశృంగార సులభ శైలి

నలరు నాటకమొద్దేని నాడుమిచట॥

చ॥ రవికరనిర్జలీకృత సరస్స్థలపోల్కి వరమ్యనాటక

శ్రవణవిహీరసంబులటు చట్టులుగట్టిన హృత్తటంబులన్

ప్రవిమలగద్యపద్యమృదు నాటకనవ్యసుధారసప్రవృ

ష్టివలన ముంచిముంచి మము సేయఁగదే చరితార్థకర్ణులన్॥ అని

నటి- ఔను, నిజమే!

క॥ పద్యము చదివినతోడనె

హృద్యము గంభీరమగుచు నెదనర్థము సం

వేద్యముగా వలెనది యన

పద్యకవిత్వంబటండ్రు పండితవర్యుల్॥

మఱియు.

క॥ కదలీపాకంబు నెతాఁ
గదియింపఁగవలయునాటకంబునఁగవివే
ల్మోదవినవినుసభవారల
కదితెలియనిబాసవో లెవ్యర్థతనొందున్॥

సభానాయకుఁడు రసప్రమాణపారావార పారీణుఁడుగనుక నే యట్టి నాటకము సా
డఁగోరినాఁడు. మఱియాగణములోని నాటక మెద్ది ?

సూత్ర- (కొంచెము సేపాలోచించి చట్టనచిటికవైచి) ఓభాగ్యశాలీ ! వినుము.

క॥ శశ్వత్ప్రోక్తోపనిష
ద్విశ్వామరవిశ్వవిజిత విధిపట్టణమై
విశ్వేశరాణ్పురమదె
విశ్వాలంకారమగుచు వెలసెడుఁగాదే ॥

ఆపురంబున.

శా॥ శ్రీమత్కస్తురివంశవారినిధినీ రేజారివిద్వజ్జన
స్తోమానారతసంగపావనుఁడును శ్లోకుండునాసుబ్బరా
యామాత్యాగ్రణి వెంకమాఖ్యసుగుణ వ్యాపారయందున్న నెన్
ధీమంతున్ శివశంకరాహ్వయులస చ్ఛ్రీపుత్రరమ్యాకృతిన్ ॥

ఆశివశంకరకవిచే నవీనముగఁ గల్పింపఁబడిన బలజాసౌభద్రీయ మను నాటకమభిన
యించి సభ్యులమనమ్ములు దుర్భరానందసందర్భములగునటులఁ జేయనగును.

నటి- (సస్పృహెబాత్సాహముగాఁదలయూచి) బళీ బాగుగాజ్ఞప్తికిఁ దెచ్చితిరి వారును
స్త్రీ బాల వృద్ధ పామరజనంబులకుఁగూడ విస్పష్టముగాఁదెలిసి సభవారి
నానంద దుగ్ధాంబుధి నోలలాడించు నాటకమదియే; తత్ప్రదర్శనంబున నీయార్యమి
శ్రులసంభావింపవచ్చును. అందుకు నేనిప్పుడేమి సేయవలయును?

సూత్ర- ప్రేయసీ సర్వఋతురాజ్యమును సమ్యక్పుష్పిత కుందవకుళ బంధురామోదసంగత
గంధవాహఘుమంఘుమితసకల దిక్చక్రవాళంబును, సమస్తజంతుజాలమునకానందా
పాదకంబును, నగు నీవసంతఋతువుం గూర్చి నీకు క్రమాగతకౌశల్యము తేఁట
శ్రావ్యముగాఁ బాడుము.

నటి- చిత్తము (పాడుచున్నది-)

గీ॥ తియ్యమామిళ్ళఁజేరియచ్ఛమీఁటె
తమచెలులఁజేరితలిరాకుగములగీటె

# ప్రథమాంకము.

పొసఁగఁ బుంస్కోకిలలు గూయఁ బుష్పబాణ
జైత్రయాత్రా జయధ్వని చాటుచుండి॥

సూత్ర- (పారవశ్యమునొంది) అహాహా! ఏమిహృదయంగమముగనున్నది! కోకిలస్వరగా
ము! పుష్పబాణ జైత్రయాత్రాజయధ్వని చాటుచుఁ బుంస్కోకిలలు గూయ
చున్నవని వర్ణించితివి కాని దానికన్న మిన్నయగు నది చూడుము

చ॥ పొలుపగునీమగానమునె పూవిలుకానిరథారవంబటం
చలయికఁ గాముకప్రతతి హా, యనిమూర్ఛిలి దేహమంతటన్
బులకలు చెంగలింపవిరి బోణులకౌఁగిలె రక్షకంబుగాఁ
దలఁచియదిప్డుపొందమిన దక్షతమారునిబందిలయ్యెడున్॥

సరే! ఇంకముందేమి సేయుదము?

నటి- అయ్యో! ఇప్పుడకా దేశివశంకర కవివిరచిత బలజాసౌధశ్రీయమును ప్రయోగ
మంటిరి! ఇంతలోనె మఱచితిరిగా!

సూత్ర- (సవ్రీడావినోదముగా)

గీ॥ మగువరో నీదు గానంపు మధురసంబుఁ
గ్రోలిసభ్యులు మనముల రూఢిదప్పి
పలకపై జిత్రితములగు ప్రతిమలనఁగ
మ్రానువడియుండి రొక్కఁడ నేనకాను॥

(తెరలో మృదంగధ్వని)

సూత్ర- (చెవియిచ్చివిని) అదిగో గానమారంభించినారు. రమ్ము-

నటి- (సస్పృహాశ్చర్యకముగా బుజముతట్టి) ప్రియుఁడా! చంద్రికాచకోరకులకే రాత్రిఁ
సవివాహముజరుగునఁట! మీరేలలక్ష్యము సేయరు?

సూత్ర- ఓసిమూర్ఖాగ్రేసరురాల! చంద్రికాచకోరకసమాగమము విధికృతముకాదా?
పిచ్చియేమి?

నటి- ఓయన్యచిత్త! అదికాదు, మీయన్నకూఁతురుచంద్రికమాట!

సూత్ర- ముగ్ధరాల! నీవుచెప్పినసంగతి నే నెఱుఁగుదుము అయినను మనమీసంగతిలో
స్థులమైయేయుండవలెను. కాఁబట్టినీవుప్రకృతోపయోగముగనుండు రేవతీ పరి:
వేషముధరించిరంగస్థలము ప్రవేశించవలసియున్నదిఁక రమ్ము.

(ఉభయులు నిష్క్రమించిరి)

ఇది ప్రస్తావన.

# బలజా సౌభద్రీయము.



## ప్రథమాంకము.

(రాజాంతఃపురము)

(అప్పుడు చంపకమాల ప్రవేశించుచున్నది)

చంప॥ ఔరా! మొన్న మొన్న వచ్చియు రాని ముద్దుమాటలచే వినువారి చెవుల కానంద
రసము నింపుచుఁ జిఱునగంతులు వేయు శశిరేఖకప్పుడె యౌవనదేవత పైకొన్నది!
కనుకనే, నేఁడొక గ్రంథముఁ జదువుచునందు

గీ॥ మరువికారము సర్వసామాన్యమయ్యు
నతివలకు వైవిధ్యమ్ములనగ్గలంబు, అను పద్యము రాఁగా

గీ॥ చంద్రబింబోపమేయలసన్ముఖంబు
నందు దరహాస చంద్రికల్ గ్రందుకొనఁగఁ
గేవలంబుగ యాథార్థ్యభావమట్లె
యభినయించెను శృంగారహావవిధుల!

(తలపంకించి) నాకేపిచ్చియేల? ఏవానియాజ్ఞ ప్రాకృతులమగు నస్మదాదులయందె కాక సర్వస్వతంత్రులగు హరిహరహిరణ్యగర్భులయందును నిరంకుశప్రాభవము గలిగి శాసించుచున్నదో అట్టి యనిర్వాచ్యమన్మథ భగవానుని విలాసమిట్లున్నది. కనుక నీవిషయములో నింత వింతయేల? సరే! ఈ యౌవనసూచనలనుబట్టి యే రేవతీదేవియును దనకూఁతునకిఁక వివాహప్రయత్నము సేయవలెననియు నీసంగతిఁ దనపతితో నీదినమునఁ బ్రస్తావించెదననియుఁ జెప్పినది, కాఁబట్టి శశిరేఖకు సత్వరంబుగఁ బరిణయంబు కాఁగలదు. నాకు గొప్ప బహుమానమబ్బఁగలదు. (ఉల్లాసముతో) ఔను! కాకేమి? ఎప్పుడు నేలికల శుభోదర్కము లేకదా సేవకులకు ఫలదాయకములగుట! (వెనుకకుఁజూచి) బళే! రేవతీబలరాములును వి

దూషకుఁడును ప్రవేశించుచున్నారు; శశిరేఖపెండ్లిమాటలువినుటకు నేనీప్రక్కగదిలోనికింబోయెదను. (నిష్క్రమించెను) ఇదిప్రవేశకము-

(అప్పుడుబలరాముఁడును రేవతియు విదూషకుఁడునుప్రవేశించుచున్నారు.)

---

బల-కోమలీ!ఈదినముననీహృదయమెద్దియో యొకదీర్ఘాలోచనయందుఁ బ్రసక్తమయియున్నటుల నీముఖవైఖరి సూచించుచున్నది, కారణమూహింపలేకుంటిని!

రేవ-నాథా! మీరెఱుంగని కారణములు వేఱేమున్నవి?

మనశశిరేఖకుఁబెండ్లియీడువచ్చినది. ఇకసత్వరముగావివాహప్రయత్నములు సేయవలెను-ఇదివఱకే యాలస్యమైనది. మిమ్ముఁగానట్టు లూరకుంటిరి. మీమగవారెప్పుడునుధన్యులే. స్త్రీజన్మముకడుఁగష్ట భాజనముగద! చిఱుతప్రాయము నుండియుఁ బ్రాణతుల్యముగఁ బెంచుచుంట నెట్టివరుండు సేకుఱునో యనిరాత్రింబవలుకఁడుం గృశించుచుంటి నిదియేనాయాలోచన

బల-అర్థాంగీ! ఈవిషయమునమనమిరువురమును సమానబాధ్యులమే. నీవువగవనేల నేనీవిషయమై యోచించుచునేయుంటి నెచ్చటను సర్వలక్షణసంపత్తిగల వరుండు పొడగానమి నింతతడవయ్యె. నయినను.

క॥ అంచితముగబిసినికిరవి
నెంచిరుముద్వతికిఁబూర్ణహిమధాముఁడా
మించుజతకూర్చెనెవఁడో
మంచివరునిఁదెచ్చువాఁడెమనపుత్రికకున్॥

ద్వారపాలకుఁడు-దేవా! దుర్యోధన మహారాజునొద్దనుండి యిరువురుబ్రాహ్మణుల వచ్చియున్నారు.

బల-ఏమీ! వారుసర్వజనమాన్యులే త్వరగాఁ బ్రవేశపెట్టుము.

ద్వార- (నిష్క్రమించెను)

దూ-సరి ఇఁక నేమి? ప్రభువుగారు ప్రస్తుతము పుత్రికకు సత్సంబంధాన్వేషణము సేయుచుండ నిప్పుడె సత్పురుష సమాగమము గూడ సమకూరె. సద్బ్రాహ్మణుఁడనయిన నావంటి సచివుఁడుండ రాజు గారికీప్సితార్థసిద్ధి యేలఁ గాపోవును? హుఁ!

బల- చాలింపుమిఁక నీయాత్మస్తుతి తనుఁదాన పొగడికొనుట మఱియొకతీరుగాను

# బలజాసౌభద్రీయము.

ఘను నీప్రజ్ఞావిశేషములు మేమిదివఱ కెఱుంగనివి కావు-

విప్రులు- (ప్రవేశించుచున్నారు-)

బల- (దిగ్గనసింహాసనమునుండి లేచి) పూజ్యులార నమస్కరించుచున్నాను-

విప్రు- దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము-

బల- అయ్యా మీదర్శనమున మావంశమెల్లఁ బావనమయ్యె సర్వధర్మవేత్తలయిన మీయట్టిమహాత్ములసందర్శనము లభించుట మాభాగ్యములు ఫలియించుటగాదే? దయచేసి యీకనకాసనములఁ గూరుచుండుఁడు-

(అందఱుఁ గూరుచున్నారు-)

బల- అయ్యా! దుర్యోధనుఁడు సపుత్త్రమిత్త్ర కళత్త్రబంధు పరివారముగాఁ గుశలముగనున్నాఁడా ?

విప్రు- ఆ- దైవకృపచే సర్వము జయముగనున్నది-

బల- చిత్తము మీరువచ్చినపని సెలవిచ్చి నన్నుఁ గృతార్థునిఁ గావించుఁడు-

గీ॥ పుణ్యపురుషులకార్యముల్ పొందుపఱిచి
ప్రీతితోవారుసెప్పెడు నీతిమనుచు
నెదుటిబలమునుదనబల మెఱిఁగియెఱిఁగి
చేయురాజ్యము సంతతశ్రీలనొసఁగు॥

అనిపెద్దలువక్కాణించెదరు-

విప్రు- హాలాయుధ నీకంటెఁ బుణ్యపురుషులెవరు? ఊరకమాయందలి భక్తింజేసి యట్లనియెదవు- సంతోషమాయె- దుర్యోధనుడు తనపుత్త్రుఁడగు లక్ష్మణునకిప్పుడువివాహముసేయనెంచి యతని కనురూపవతియగు కన్యనెచ్చటను గానక నీపుత్త్రియగు శశిరేఖ సకలసద్గుణముల నతనికి సమానురాలని విని యామెను దన కుమారునకిచ్చి పరిణయముసేయ నీయనుమతిగొనిరండని మమ్మునీకడకుఁ బంపినాఁడు- దుర్యోధనుఁడు నీవెఱుఁగనివాఁడుగాఁడు జగమెఱిఁగినబ్రాహ్మణునకు జందెమేల నన్నట్లునాతని సంపదవర్ణింప ననవసరమయ్యుఁ జెప్పుచున్నాము వినుము-

గీ॥ తమ్ములందఱు నెన్న నుదారబలులు
పుత్త్రశత మెంచ నేటికిమిత్త్రసములు
తాననఁగ రాజరాడ్బిరుదప్రభాసి
సిరులుసంపదలిఁక వేఱ చెప్పనేల?॥

రేవ- (ఒకనిమిషమాలోచించి) ప్రాణేశ్వర! నాకొక్కసందియముమాత్రము బాధించుచున్నది. పాండవులుద్యూతాపజితులయి యడవులకుఁబోవునప్పుడుసుభద్రాభిమన్యులిచ్చట నేనిలిచియుండిరిగదా? అప్పటినుండియు మనశశిరేఖయు నభిమన్యుఁడు గలసియాడుకొనుచుండఁ బ్రజలందఱు «శశిరేఖ యభిమన్యునిభార్య» యనియొక్కటనొక్క వక్కాణించుచుండిరి. మఱియునిప్పుడు «పాండవులు కాలముదప్పి కానలనుండఁదోడబుట్టినది. తమయింట జీవనము సేయుచున్నదన్న చులకనచేఁ గదా పిల్లనితరులకిచ్చికొంటిరి! అనునపవాదము రాకమానదు. ఎంతటివారును లోకులకు వెఱవవలెనుగదా! లోకములోఁ బ్రజలనేకులు లోకనిందకే వెఱచుచున్నారు. పరమార్థము దేవుఁడెఱుంగును.

బల- (నిరుత్సాహముతో) అమ్మో! అతిరభసప్రసారముగల సెలయేటిప్రవాహమునకు బెడ్డకొండయడ్డువచ్చెఁగదా! (కొంతతడవాలోచించి)

ఉ॥ మంతనమేమిటో చదభిమన్యునకీయఁగనైనలోకవి
శ్రాంతరమావిశాలుఁడగు రాజకుమారునకీయనైనని
చింతనునామనంబవుర చేష్టలుదక్కఁ జలింపదాయయా
స్వాంతముక్రిందుమీఁదులనుగల్గినలోహశలాకపోలికన్ ॥

(మఱియునాలోచించినిశ్చయభావముతో) ప్రేయసీ! నీవిట్లులోకపరిపాటిచేఁబలుకుచుంటివేకాని యిందలిపరమార్థము కనిపెట్టలేకున్నావు. లోకములోనే నటీమనునొక వెఱ్ఱిచేఁ గొందఱుగుందుచున్నారు. ఎప్పుడుఁ గ్రొత్తసంబంధమెన్నున్న యానందము ప్రాచీన సంబంధమందుండదు. అదిగాక యెంతయుఁ గ్రొత్తసంబంధసంగ్రహము సేయుచుండిననే కాని లోకములోఁ బలుకుటుంబములకైకమత్యముగలుగదు. ఇంకొకటి ఒకగొప్పపండుగల చెట్టువిత్తనము నాటగా దానివొక్కదానికన్నఁ జిన్నకాయలుగాఁచును. దానివిత్తును నాటగా దానికన్నను చిన్నకాయలఁగాచును. ఇటులనే రానురాను బొత్తిగబలహీనమగును. మనుజులును క్రొత్తక్రొత్తరక్తసంబంధము చేఁగడుబలియులుద్భవింతురు గానియేకప్రకృతి రక్తము నేగలవారు మాటిమాటికినిగలయుచుండినఁ గడుబలహీనులుబుట్టుదురు. ఇది శాస్త్రమర్యాద. ఇవియన్ని యోచింపకుండ నీయము శశిరేఖ నభిమన్యునకిచ్చినచో శ్రేయము చ్చటలనదుగనా?

శేవ- నాథా! నేను జెప్పునదిఁక నేమున్నది? ఎవరికైనను విద్యాధికిఁ [illegible]
లెనకైకోరికయేకాని వేఱుగాదు కాబట్టి

గీ॥ అత్తగోడండ్రవైరములడంచివార
లిరువురకుఁబ్రాణసమముగఁదానయిక్కయగు మ
రూపమునమారుఁగేలెడుచూపరిమన
పుత్రికకుభర్తగావలెముఖ్యముగను॥

[illegible] తరువాతనో! తమచిత్తము.

బల- (సవిమర్శముగా) అయ్యలార! వేయు నేల? వివాహకార్యములలో మా[illegible] మేన ల్లుఁడుగీనల్లుఁడునను మోమాటమికట్టిపెట్టవలెను రత్నమువంటిపిల్లను ముసల్లుఁడవి యభాగ్యున కిచ్చి దానికి మితిమీరినదుఃఖము గలుగఁజేసి పాపము చేరార వాడివర కములనుభవించుటకంటె లోకాపవాదమెట్లయినఁ భరింపవచ్చును. లోకులు కాకు లువంటివాండ్రు. లోకానుసారముగ నడుచు మహాత్ముఁడొక్కరుఁడును లేఁడు. అట్లునడచిన నియుఁ గతిపయదినములలో వాఁడుసర్వభ్రష్టుఁడై చెడకమానఁడు. లోకములోఁ బ్రతిమనుజుఁడును నెల్లెయెవరో జగడచుటయుఁ గొంతపబ్బు పెనుకఁ బెడుటయు పరులదోసము లెంచుటయు ముఖ్యధర్మములుగాఁ జూచువారు గాని లోకజ్ఞానము గుణదోషవిచారము; మానుషధర్మజ్ఞత; ఇవిగలవారెక్కడనోగాని లేరు. అట్టి[illegible] లోకులని మెదరన్న భీతియేలకి? ఇట్లు నిందించెడు ప్రతివాఁడును స్వవిషయము వచ్చి నప్పుడు వేఱగును. తదితరులు వానినిందించుటకై లోకులగుదురు. అదిగాక యొక గృహస్థుఁడు సమస్తకష్టసుఖముల నెఱిఁగి తనసంసారమును దానుద్ధరించుకొను చుండ దానిలాభనష్టములతో సంబంధము లేని పయితేలుగాఁడ్రెందఱు సంగతిసంద ర్భములనెఱుఁగకయే వానిచేయుకృత్యములకు వంకలొత్తుచుండుట నీ లోకము నకుఁ గడుదురభ్యాసమయినది. ఇట్టిదురభ్యాసముల బోకార్ప సర్వేశ్వరుఁడసమగ్ర హించెడుఁగాఁత! లోకోభిన్నరుచిః॥ అనునట్లు లోకులంవఱు నొకపంథ నెప్పుడు డునఁబోరు. "వృషభస్యతుశృంగంవా కాకస్యశ్రమకారణం॥ అనునటుల పెద్దపుండు కాకికినొప్పియో? కాఁబట్టి చిరంజీవియగులక్ష్మణునకు నాకూఁతునిచ్చెదను దీని చేసియిప్పుడెశుభముహూర్తనిశ్చయము సేయుఁడు.

విప్ర- (ఆలోచించి) ఎల్లుండి తెల్లవారుజామున తారాచంద్ర బలములనవద్యములుగ న

స్నవి. అదిరేమంచిముహూర్తము.

బల- సరే అటులయినమీరప్పుడు తఱలిరావలెను. ఇదిగోఈకర్పూర తాంబూలమందికొ నుండు. (ఇచ్చుచున్నాడు)

విప్రు- (పుచ్చుకొని) దీర్ఘాయుష్యమస్తు. ఇఁకమాకుసెలవొసఁగుము.

బల- చిత్తము. దయనుంచుఁడు.

(తెరలో వైతాళికుఁడు)

చ॥ పొలములనుండికర్షకులు పోయెదరిండ్లకునైచకొండకుఁ
గొలఁకులడస్సివారిఖగకోటితటాభినిశేరుచుండెనీ
ఇలనినుఁడుగ్రతేజమునఁ జేఁచుచునుచ్చనుబొందివెల్గగా
ఖలనివహంబువోలెనతికార్శ్యముఁ జొందెడునీడలిప్పుడున్॥

బల- (పైకిఁజూచి) ఓహో! మధ్యాహ్నమైనది. నేనువభ్యవహారాదికృత్యముల నిర్వర్తింప వేగదను. (అందఱునిష్క్రమించిరి.)

ఇది ప్రథమాంకము.



శ్రీ.

# బలజాసౌభద్రీయము.



## ద్వితీయాంకము.



రంగము-కృష్ణమందిరము.

(అప్పుడు పరిచారకుఁడు ప్రవేశించుచున్నాఁడు-)

(ఆకాశమువంకఁజూచి) ఆహా! సర్వధర్మములను సంపూర్ణముగఁ దెలిసినట్టి పెద్దపెద్దలే సత్యముతప్పుచుండఁగ నిఁక వస్త్రదాదులలెక్క యెక్కడిది? బలరాముఁడు తనకూఁతుఁ శశిరేఖ నభిమన్యునకిచ్చెదనని తొలుతనుండియు వచించుచుండి యిప్పుడు దుర్యోధనుఁ డడుగఁబంపఁగనే యుబ్బి వట్టివెంగలియై పిల్లను లక్ష్మణునకిచ్చెదనుగాని యభిమన్యునకీయనని గంతులువేయుచున్నాఁడు. కేవలధనమునే కోరినాఁడుగాని గుణదోషములనెంచినవాఁడుకాఁడు. పాండవులు సర్వదేవతాప్రసన్నతగలవారు. ఈకార్యమగునటులను నాకు నమ్మకము చాలదు. ఔఁ! ఇంతకొక పరమార్థముగలదు.

క॥ కాఁగలకార్యములన్నియు
సాగకమానవల్ల సరసిజభవుఁడే
యేగడియ కేదిగూర్చునొ
బాగుగయోచింప ధర్మపద్ధతి నెపుడున్ ॥

(తెరలో)

ధు॥ దాసీపుత్ర! సాధు! క॥ కాఁగలకార్యములన్నియు॥ అను పద్యము తెరలోఁజదువఁబడుచున్నది.

ఓహో! మనప్రభువగు శ్రీకృష్ణభగవానులు సభామంటప మలంకరింప వచ్చుచున్నారు? నేను నాయన పార్శ్వవర్తినయ్యెదను- (నిష్క్రమించెను)

ఇది ప్రవేశకము.

[అంతట సత్యభామాద్వితీయుఁడై శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు-]



కృష్ణు-సాధు! దాసీపుత్ర! సాధు! (క॥ కాఁగలకార్యములన్నియు॥ ననుపద్యమును మఱలఁ బఠించుచున్నాఁడు-).

పరి- అయ్యా! ఇదిగో యాసనము నిందుదయచేయుఁడు.

ఉభయులు-(కూరుచున్నారు.)

కృష్ణు-(ఆకాశమువంకఁ జూచి తలపంకించుచు) ఆహా! సర్వలక్షణసంపన్నుఁడును, మేనల్లుఁడునగు నభిమన్యుఁడుండ మాయన్నగారికి లక్ష్మణుఁడల్లుఁడు గావలసివచ్చెఁగా!

సత్య- నాథ! గీ॥ కూఁతుఁగలవారలవ్వలఁగూరుచుండ
వారికోర్కెలన్యునివలననుండ
నిట్టినిష్ఠురవాక్యములిచటమీరు
ఘన్యసించుటవలననౌ ఫలమిఁకేమి॥

గీ॥ ఆల్లధనంజయసుతుఁడు మేనల్లుఁడగును
మీకుసోదరికిసమముగ మేఘువర్ణ
అట్టియెడధర్మమవ్వలఁగట్టివార
లుండమీరిట్లుపల్కుటయుక్తమగునె॥

అదియునుఁగాక యభిమన్యునిప్పటిస్థితిఁజూడఁ; బూజ్యులయిన బావగారి యుద్రేకముఁజూడ; శశిరేఖ నభిమన్యునకుఁ గూర్పఁజాలుట పట్టివెఱ్ఱితనము.

(తెరలో)

మత్తకోకిల-ఎన్నిమాయలుగల్గుచుండెనిదేమిచిత్రమొ! చూడఁగన్
జిన్నిప్రాయమునుండినాకలసీరిపుత్రికకోడలౌ
నన్నమాటలుకల్లలైయిపుడద్భుతంబులుపుట్టెనే
నెన్నఁడైననునెగ్గొనర్చితినే మొసీరికిదైవమా॥

కృష్ణు-(చెవియిచ్చివిని) అక్కటా! సుభద్రవచ్చుచున్నదిగదా! ఈపెకీసంగతి యింతలోన యెట్లుతెలిసినదో; ఈపె నెట్లూరడింతును?

సుభద్ర-(నిట్టూర్పువిడుచుచుఁ బ్రవేశించుచున్నది-)

కృష్ణు- సోదరీ! ఎల్లప్పుడుఁ గలకలఁదేఱియుండు నీముఖంబీదినమున బొత్తిగఁ గలఁకఁ బాఱి చిన్నపుచ్చుకొని కడుదీనత్వమును సూచించుచున్నది?

సుభ- నావంటిమందభాగ్యురాలికి దీనత్వముగాక ధీరత్వమెట్లువచ్చును.

కృష్ణు- దుర్వారదైవదుర్విలాసముచే నీభర్తృకాంతారసంతానములఁ గ్రుమ్మరుచున్నను నీవుఖేదపడియెదవను చింతచే నెంతయు జాగరూకతతోనున్నవారముగాని వేఱుగాదు. అట్టియెడ నీవింతవంతనొందుటకుఁ దగిన నూతనకారణమేమి?

సుభ- అబ్బ! ఏమియు నెఱుఁగనివానిఁబోలి యెంతచిత్రముగా నటించెదవోయి! శశిరేఖను లక్ష్మణునకిచ్చెదరఁట గా! (కన్నీరు పయ్యెటనొత్తికొనుచు) కాలవశమున నాభర్త యడవులఁబడి తిరుగుచున్నను లక్ష్మీసమానురాలయిన యీపిల్లను జూచుకొని రోజులుబుచ్చుచుంటి నట్టియెడ నామనోరథము అన్నియు నడఁగె- నా కొంగుమాట వోయె. హా! పాపపుఁ గాలపురుష! సాధుబాధక! అహా?

(యేడ్చుచుఁ గ్రిందఁ జతికిలఁబడుచున్నది)

కృష్ణు- (లేవనెత్తి సేదదేర్చి) అమ్మాయి! ఇంత వెఱ్ఱిదానవయితివేమి? నేనుండ నీకుమారియొకలోటురాఁగల్గునా?

సుభ- ఔను ఇదివరకు నేనట్లే నమ్మియుంటి అదియంతయు నడవిదిసరేకాని, బలరామునికడ కొకసారిపోయి సందేహనివృత్తిజేసికొని యనవలసినమాటలని వత్తునా?

కృష్ణు- అడ్డమేమి? పోదమురమ్ము- (ప్రక్కకుఁజూచి) సాత్యకీ!

సాత్యకి-(ప్రవేశించి) అన్నా ఏమితమయాజ్ఞ.

కృష్ణు- బలరాముఁడు శశిరేఖ నభిమన్యునకీయననెనఁట! కనుఁగొందమురమ్ము.

సాత్యకి-(సక్రోధవైవర్ణ్యముగా) ఇదిగో సర్వసిద్ధుఁడను-

అందఱు (నడచుచున్నారు)

పరి- అయ్యా! ఇదేబలరామసౌధము-

అందఱును బ్రవేశించిరి-

## రంగము-బలరామాంతఃపురము.

(బలరాముఁడు సింహాసనస్థుఁడైయుండఁ గృష్ణుఁడును సాత్యకియు సుభద్రయుఁ బ్రవేశించుచున్నారు-)

బల- కృష్ణ! ఈయాసనమునఁ గూరుచుండుము- సాత్యకీ! నీవు నిట్లఁ గూరుచుండుము-

కృష్ణు- సోదరీ! ఎల్లప్పుడుఁ గలఁకఁదేఱియుండు నీముఖంబీదినమున బొత్తిగఁ గలఁకఁ బాఱి చిన్నపుచ్చుకొని కడుదీనత్వమును సూచించుచున్నది?

సుభ- నావంటిమంద భాగ్యురాలికి దీనత్వముగాక ధీరత్వమెట్లువచ్చును.

కృష్ణు- దుర్వార దైవదుర్విలాసముచే నీభర్త కాంతారసంతానములఁ గ్రుమ్మరుచున్నను నీవుఖేదపడియెదవను చింతచే నెంతయు జాగరూకతతోనున్నవారము గాని వేఱుగాదు. అట్టియెడ నీవింతవంతనొందుటకుఁ దగిన నూతనకారణమేమి?

సుభ- అబ్బ! ఏమియు నెఱుఁగనివానిఁబోలి యెంతచిత్రముగా నటించెదవోయి! శశిరేఖనులక్ష్మణునకిచ్చెదరఁట గా! (కన్నీరు పయ్యెటనొత్తికొనుచు) కాలవశమున నాభర్త యడవులఁబడి తిరుగుచున్నను లక్ష్మీసమానురాలయిన యీపిల్లను జూచుకొని రోజులుబుచ్చుచుంటి నట్టియెడ నామనోరథము అన్నియునడఁగె- నా కొంగుమాట వోయె. హా! పాపఁపుఁ గాలపురుష! సాధుబాధక! అహా?

(యేడ్చుచుక్రిందఁ జతికిలఁబడుచున్నది)

కృష్ణు- (లేవనెత్తి సేదదేర్చి) అమ్మాయి! ఇంతవెఱ్ఱిదానవయితివేమి? నేనుండ నీకుమరి యొకలోటు రాఁగల్గునా?

సుభ- ఔను ఇదివరకు నేనట్టులే నమ్మియుంటి అదియంతయు నడ వినదిసరే కాని, బలరామునికడ కొకసారిపోయి సందేహానివృత్తిజేసికొని యనవలసినమాటలని వత్తువా?

కృష్ణు- అడ్డమేమి? పోదమురమ్ము- (ప్రక్కకుఁజూచి) సాత్యకీ!

సాత్యకి- (ప్రవేశించి) అన్నా ఏమితమయాజ్ఞ.

కృష్ణు- బలరాముఁడు శశిరేఖ నభిమన్యునకీయననెనఁట! కనుఁగొందమురమ్ము.

సాత్యకి- (సక్రోధవైవర్ణ్యముగా) ఇదిగో సర్వసిద్ధుఁడను-

అందఱు (నడచుచున్నారు)

సారి- అయ్యా! ఇదే బలరామ సౌధము-

అందఱును బ్రవేశించిరి-

రంగము-బలరామాంతఃపురము.

(బలరాముఁడు సింహాసనస్థుఁడైయుండఁ గృష్ణుఁడును సాత్యకియు సుభద్రయుఁ బ్రవేశించుచున్నారు-)

బల- కృష్ణ! ఈయాసనమునఁ గూరుచుండుము- సాత్యకీ! నీవ్విట్లు గూరుచుండుము-

## ద్వితీయాంకము.

దోషమం(డుమహితాత్ములిలన్
గానసుతను బాధ జనరు
దానమొసఁగి దానభువినిధన్యుఁడవగుమీ॥

బల- కృష్ణ! నీపక్షపాతఁపుమాటలు విని నేనెట్లు మోసపోదును?

ఉ॥ లక్షణవంతుఁడై వెలయులక్ష్మణు అల్లునఁ బోల్చి చెప్పెదో
భిక్షకుఁడైన పార్థ జానిఁ బెద్దగఁ జెప్పెదవిత్తువంచుని
పక్షమెచూతుగానియతివన్ దగుభర్తనుగూర్పఁ జూడవీ
వక్షియె? కాక; సోదరునికూఁతురదేడఁబిత్రివ్యులెచ్చటన్॥

క॥ తాఁదాల్చినదుందేటికిఁ
బాదములిలమూఁడఁటంచుఁ బల్కెడుభంగిన్
బీదయగుపార్థుపట్టిని
సోదర! వరునోనుఁబోల్పచోద్యముఁగాదే॥

క॥ నవమ(ద్రసభ్యోన్నము
లెవఁడావలఁదో)సిగంజి నేకొనవెంచుం
భువివాఁడులక్ష్మణునివిడి
వివరింపక పార్థ జానరుఁబిల్లనొసంగున్॥

కృష్ణు- సుభద్రవంకఁ జూచుచున్నాఁడు.

సుభ- అన్నా! గీ॥ పార్థునాథుఁడు మఱఁదులు బావలెల్ల
విధివశమ్మునఁ గానల వేఁగుచున్న
మీఱు సిరిగల్గియిటులుండ మీరునాకు
దిక్కుటంచును నమ్మితిఁ(దికరణముగ॥

చ॥ పురజనులందఱుం జెలఁగి పూర్వమునుండియుఁ నీకనూజ నా
వరసుతు భార్యయంచునని వారణవాక్యులఁ బల్కెదోఁడి రా
పరువు నునిల్పియన్యనకుపళ్నలకుప్పను బెండ్లి సేయఁగన్
మరలక సాదరంబుగ నమ్మాయభిమన్యునకీయుటొప్పగున్॥

క॥ చెల్లెం(డ్రమాటలన్నలు
చెల్లించుట లెస్సయగుటఁజిరజీవుఁడు మే

నల్లుండభిమన్యునకును
బిల్లందయచేయుమదియోఁబ్రీతియనదగున్॥

క॥ ధనవంతులయినవారికిఁ
దనయలనెవరైననొసఁగదరదిఘనంబే
పెనుబీదవానికిచ్చిన
ఘనునకెయిహపరములందుఁగల్గుశుభంబుల్॥

బల- ఆహా! ఎంతచిత్రమైన మాటనువింటిని నేడుసుభద్రా! ఏది! ఇప్పుడునీవుపలికిన ముద్దుమాటలుతనివిదీఱలేదింకొకమాఱువచింపుము చెల్లెలా! నీకొమరునకు నాకూతునీయవలయునో! నీకుసిగ్గేలేదు! ఆహా! పాడులోకము! తమకోరికఁ జెల్లించుకొనువిషయమున నీప్రజలకుఁయుక్తాయుక్తములుతోఁచవుగదా! రత్నమువంటిపిల్లనుగొంతుగోసినీకొడుకునకుఁ గట్టిపెట్టకపోయినలోటేమి? నీకొడునకుఁ బెండ్లికాకపోయిననెవరికిచింత? ఏమిమునిఁగిపోయె! బాగుబాగు! నీకోరికఁ జూడనందనిమ్రానిపండ్లకఱ్ఱులుసాచుటగానున్నది. లోకములోనొకముష్టివాఁడు తోలుతగుప్పెడుభిక్షమనుచువచ్చి యొకగడియ కూరుచుండనిచ్చిన భోజనాధికా యగును. అట్లున్నవి నీయడియాసలు!

మత్తకోకిల॥ కూఁడుగుడ్డలతోడఁదృప్తిలికూర్మినుండకపైపయిన్
గోడలంచువచించెదో బలె! కొల్లబోవునెభాగ్యముల్
చేడె! యేదగృహప్రవేశముసేయఁ జేతువెకోడలన్
జూడఁజూడఁగనిట్లుదోఁచెనె! చోద్యమయ్యెఁగనుంగొనన్॥

గీ॥ కామధేనువునింటనుగట్టిపెట్టి
కట్టెలకుఁబ్రాకులాడుకరణిఁదోఁచు
యక్షరాట్తుల్యులక్ష్మణునవలవిడిచి
కొండద్రిమ్మరియగుపార్థుకొడుకుకీయ॥

సాత్యకి- (చిఱ్ఱునలేచి) అన్నా?

ఉ॥ అర్థిలిలేనిచోసుతనువాకపపాత్రునకీయనంటివా
దుర్మదులైనకౌరవులస్తోత్రముసేయుచుఁబెద్దసేపుస
త్కార్ములఁబాండుపుత్రులనుగాఱులు పల్కఁసహింపవచ్చునే

ధర్మనిధాన! నీరసనదాల్చెదవెట్లుమహాత్మదూషణన్॥

సుభ- (దైన్యముతో) అన్నా!

సీ॥ మృగరాజవిక్రములగుపాండుపుత్రులనెడఁబాసి మీయింటఁగడుపుఁగూఁటి
కిటులుంటచేఁగదా! యింతిపలుచనైతినైనఁబో చెల్లెలనగుదుఁగానఁ
దప్పేమియన్ననాతనయుఁడు లెస్సైనఁగోడలేరాకుండఁగొల్లవోనె
మున్నునీవాడినవన్నియేమాయెనువత్తాపహృతికంటెఁదప్పగలద
క్షితినిదుశ్చింతులెద్దానిజేయఁదగరు
చెల్లబో! నేనుబోయెదసిగ్గువచ్చె
నింకనీవునుకురురాజునేకముగను
కట్టఁగట్టుకవ్రేలాడుఁడుట్టిగట్టి॥

విదూ- హలాయుధ! ఏడుతెరములనాటి తోడఁబుట్టినపడుచు కనులఁదడిపెట్టిన దండె మునున్న యస్త్రములగ్గినంటుకొన్నవఁట సుమీ!

సుభ- (కృష్ణునితో) అన్నా ఇంతేకద!

కృష్ణు- నేనేమిసేతునమ్మా?

గీ॥ నేనుబల్కెడుమాటలు నీళ్ళకన్నఁ
బలుచనగఁజూచియెప్పుడుఁ బల్కుసీరి
పాండవులయెడనాకెప్డు పక్షమంచు
గాన నేనేమిసేతును కన్యపట్ల॥

మాయన్న నాకెప్పుడును పాండవపక్షపాతియనియే పేరుంచినాఁడు- నావలన నగునదేమియు లేదు- నీకుదిక్కుగల చోటికిఁబొమ్ము-

బల- అబ్బ! కృష్ణునకెక్కడనులేని పౌరుషమువచ్చినదే!

కృష్ణు- సహోదరిసముఖమునకు వచ్చిన నాపై నతికఠినోక్తుల నొప్పించి పోనాడినమీయట్టి ధర్మవర్తనులకుఁ బౌరుషముగాని ధర్మవర్తనులగు పాండవులయెడ పక్షము వహించిన నాకు నిజముచేతఁ బౌరుషముండుట తప్పే.

విదూ- ఐహవ్వా! కృష్ణుఁడు నామనసునకు వచ్చినవాఁడు తనలో (బెల్లముగొట్టిన రాయివలె హలాయుధుఁడూరకుండెను. ఏమనునో చూచెద)

బల- (కోపముతో చేతులుచాచి) వాసుదేవ ఈపె నర్జునునకిచ్చి యెంతగాననుభవిం

చిత్రమి- ఇఁకశశిరేఖ నభిమన్యునకిచ్చి రెండుచేతుల జుట్టైదవుగాఁబోలు నేమి !

కృష్ణు- అన్న ! ఇష్టస్వీకర్తమగు కార్యములయందు దోషారోపణముఁ జేయుటకుఁగా రణములుండకపోవు నే- ‹‹అతిసర్వత్రవర్జయేత్›› అను న్యాయమున సుధయందతి మాధుర్యముండును కావున నది వర్జనీయముకాదే ?

(తెరలో)

చ॥ కిలకిలమంచుఁ గూయుచును గీములఁజేరెడుఁ బక్షిసంఘముల్
లలనలు మెల్ల మెల్ల ననలంకరణక్రియలన్ మెలంగెదర్
చెలువుఁడుసత్ప్రథానుగమశీలుఁడు చల్లనిరాజువచ్చునం
చలరుచుఁ బూర్వదిగ్వనితయానన మందను రక్తిఁజూపెడున్ ॥

బల- (సక్రోధసంభ్రమముగా) ఇఁక సాయంకాలమయినది కాలకృత్యములకయి నే నేగెదను-

(నిష్క్రమించెను.)

కృష్ణు- బాగుబాగు ! (తలయూచి) సుభద్ర ! నేనును కాలోచిత కృత్యములఁ దీర్పఁ బోయెదను నీవు వగవకుండుము- నీబిడ్డకుఁ బెండ్లికాకపోదు- నీకోరికయెట్లో నట్ల జరగఁగలదు- నీవు ధైర్యముగా నుండుము- సేవక ! మాగను !

సేవ- అయ్యా ! ఇట్లిట్లు-

(ఉభయులు నిష్క్రమించిరి-)

(తెరలో) పంచచామరము-

బళే ! పసందు మేల్ శబాసు పార్థనందనుండు కా
నలందు వ్యాఘ్రసింహ ఖడ్గ నాగశల్యపోత్రులం
బొలోపాలం దుఁబట్టిచావ మోఁదిశౌర్యమూర్తినా
విలక్షణరుపు రూపుదోఁప వేటనుండి వచ్చెడున్ ॥

సుభ- (చెవియిచ్చివిని) అదిగో నాకొడుకు వేటనుండి వచ్చుచున్నాఁడు ! ఇప్పుడీ మాటలతని కెట్లుచెప్పుదును-

అభిమన్యుఁడు- (ప్రవేశించి కొంచెము సేపుజూచి) అమ్మా ! నీముఖమిదివరకు మిక్కిలి విచారమును మెల్లడించుచున్నది- కారణమేమి ?

సుభ- (మోమువంచి యూరకున్నది-)

అభి- (సమీపించి) తల్లీ ఒకవేళ నరుఁవులలో శ్రమలఁబడు నాపితృజనముకడనుండి యే
మియు వర్తమానము దెలియలేదుగద (తొందరపాటుతో) వారికి క్షేమమేకద !

సుభ- (ముఖము ప్రక్కకుఁ ద్రిప్పుకొను చున్నది)

అభి- (తనలో) అయ్యో ! ఈమె యేసంగతియుఁ జెప్పకున్న దేమికర్తము ? (కొంచె
ము యోచించి) కాని ! నాపితృజనము క్షేమముగనే యున్నారు- లేకున్న నీమె
యిట్లుండదు- నాపైనే దేని కోపకారణమున నిట్లున్నదిగాఁబోలెదును- (తల్లి
పాదముల పైఁబడి సబాష్పగద్గదికముగా) జననీ !

సుగంధి॥ చిన్నిగోలనైననన్నుఁ జిక్కువెట్టఁబాడియే
యెన్నఁడైననీకుమాట లేనొనర్చినాడనే

సుభ- (కోపముతో నభిమన్యు నావలకు నెంటి తాను విముఖముగాఁ దిరిగినది)

అభి- (లజ్జాక్రోధములతోఁ జివాలున లేచి)

సుగంధి॥ అన్న కన్నతల్లికిట్టు లాగ్రహంబుఁ దెచ్చియుం
కన్న నేయు నేమిలాభమీయసుల్ త్యజింతుఁ జీ ॥
(అనియొఱలోని కత్తిఁ బెఱుకుచున్నాఁడు-)

సుభ- (దిగ్గన లేచి) అయ్యయ్యో ! కుఁడగేఁడ ! త్వరపడకుము ! త్వరపడకుము- (అని
యొక్కయొకచేఁ జేయిపట్టికొన్నది)

అభి- (రోషముతోఁ జేయివదిలించుకొనఁ జూచుచు) అమ్మా ! మాతృదేవతాసహ్యావ
ర్తనుఁడగు నీదుష్టుని మతియొకతీరుగా నిమ్ము-

సుభ- అబ్బాయి ! నీదోషమెంతమాత్రమును లేదు శాంతించుము-

అభి- అటులయిన మతినీవిచారకారణమును జెప్పుము-

సుభ- (నిట్టూర్పువిడుచుచు) కుమార, అభిమన్య-

చ॥ అలశశిరేఖనీకుఁ బ్రియయౌనని నేమనిశ్చయించియుండని
న్నలతిఁగఁజేసి కౌరవుల కర్పణసేయఁగఁ బూనెసీరి యీ
ఖలునకు నెన్నఁడైన నపకారమొనర్చితినన్న లేదు సా
మ్ములమదిఁగోరి వారలకుఁ బుత్రికనీయఁగనుద్యమించెరా ॥

అభి- (విఱుగవృతోఁగూడిన నైరస్యముతో) తల్లీ ! ఘోర ! ఎంత వెఱ్ఱిదానవై నీవు
క్షోభించి నన్నుఁ క్షోభపెట్టితివి- బలరాముఁడు తనగర్భవాసజనితయగు శశిరే

ఖను దనకిష్టమయినవారికిచ్చుకొనుపట్ల నీయాటంకమేమి ?

సుభ- అదిగాదు కుమార ! బలరాముఁడు పిల్లనీననుట యెట్లున్నను ననీన్నిదేహమునువి డువఁదగినన్ని కాటులాడినాఁడు ఎట్లు వగవకుందును- ఆమాటలువినుము- తా బెట్టిన కూడును తానిచ్చిన గుడ్డను కట్టి మాలనుండక సకలైశ్వర్య సంపన్నురా లను తెంకూతును నేకోడలనుట తప్పట- కొండద్రిమ్మరియగు నీతండ్రితో వియ్య మందుట కామధేనువను బోనాడి కట్టెలమ్ముకొనినట్లట వేయేల అన్నమాట లన్నటులే జెప్పెదవినుము. (కూడుగుడ్డలతోడ, నవరసభక్ష్యాన్నము కామధేనువు నింట ననుపవ్యములనుజదువుచున్నది-)

అభి- (పామువలెబుస్సకొట్టి యతికష్టములోఁజెవులమూసికొని)

గీ॥ అక్కటా! పాపియాసీరియాడినట్టి
పల్లదంబులనేలనాయుల్లమవియ
వేటువేటుగఁజెప్పెదుపీనులెంతొ
తూఁట్లుపడనిట్లసైనెనిన్నుదుర్మదమున॥
(మల్లఁజటిచి)

పంచచామరము॥ సరే! సరోజనేత్రినీయపాగకున్నఁబో! బలే
దురాత్ముఁడౌసుయోధనుణానుతుల్ కడంకఁజేసియా
పరేతరాట్సుతాటులఁబ్రభాకరాగ్నితుల్యులన్
గరంబునిందసేయునేమికారణంబొ చూచెదన్॥

మ॥ బలరామాదులుయాదవుల్ మఱియునా పాపాత్ములౌకౌరవా
ఖ్యులునీరేజభవాదిసర్వదివిజుల్ ద్యోలోకముంభూమియున్
తెలుచందాకినరూపుమాఁపిజనకుల్ ప్రీతిల్ల గానిప్పుడా
లలనంజేకొనిపెండ్లియాడెదనునాలాపందటున్నెన్నఁగన్॥
అనిధనుష్టంకారము నేసిపోఁబోవుచున్నాఁడు

సుభ- చేయిపట్టుకొని

గీ॥ కొడుక! నీవిప్పుడేగ మూఖులఁగణింతు
రార! గయ్యాళియానుభద్రమ్మయనుచు
బిల్లనీకున్నఁబోయెబో! చెల్లుగాక

మామపైఁగత్తిఁగట్టుటమానుతండ్రి?

ఛి- పెనిమిటినివిడిచిపుట్టినిల్లే సౌఖ్యదాయక మనియెంచుమూర్ఖులు లోకములోఁబలు కష్టములనొందెదరుసుమీ?

గీ॥ ‘‘భర్తకై యగ్నినైననుబడఁగవలయు’’ నను న్యాయ మెఱుఁగవే

భ- నాయనా! ఇందునాలోపమేమియులేదు. నేను వెంటవచ్చెదవని యెంతవిలపించినను నిసుగువైననీసంరక్షణమునకై నన్నిచట నుండుమని నీతండ్రి నాకాజ్ఞ ఇచ్చినారు.

పరిచారిక- అమ్మా! భోజనసమయమయినది దయచేయవలెను.

భ- కుమారా ప్రాతఃకాలమున భుజించివేటకయి జని అలసివచ్చితివి- ప్రొద్దుపోయినది భుజించినవెనుక యోచింతములెమ్ము-

(అందఱు నిష్క్రమించిరి)

ఇదిద్వితీయాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## తృతీయాంకము.

రంగము-శశిరేఖాంతఃపురము.

(అప్పుడుచంపకమాలప్రవేశించుచున్నది-)

(తలపంకించుచు) ఔర! ఇంతలేసి కార్యములుండునుగాఁబోలు! నిన్న రాత్రి సుభద్ర; కొమరుతోఁగూడ నెచ్చటికోఁ బోయినట్లు వదంతికలిగినది. ఎచ్చటి కోయేమి? పాండవులకడకే కావచ్చును. ఔను! కాకేమి? బలరాముఁడాడిన మాటలకు సుభద్ర యింకయుఁ బరమశాంతురాలుగనుకనే యోర్చికొన్నది మఱి నాబోటిదిగావలసినది! అప్పుడె ప్రాణత్యాగముచేసియుండును! పోయెఁ.. బో! ముందీసంగతి శశిరేఖ వినినంతనే యొట్లుపెట్టుపట్టఁగల్గునుదైవమా! ఇది వఱకే యభిమన్యుని మనసుదీఱ తఱచు చూడనైతినని కడువిలపించుచున్నది. ఇప్పుడీసంగతి మఱియు మిక్కిలిగాఁ బొక్కునుగద! కానిమ్ము! ఎట్లైనట్లౌజరుగగలదు. (ప్రక్కఁజూచి) అదిగో శశిరేఖ సఖీసహితముగా నీవైపునకేవచ్చుచున్నది. నేనింకొకదెసకేగెదను. ఈసంగతినానోటఁజెప్పలేను-(నిష్క్రమించెను)

## ఇదిప్రవేశకము.

(అంతటశశిరేఖయు సఖులును బ్రవేశించుచున్నారు)

శ- సఖీ! శీలవతీ! ఈమధ్య నాహృదయమేమో వాచామగోచరమయిన యవస్థనొందుచున్నదిగదమ్మ!

ల- చంద్రముఖీ! మనశశిరేఖహృదయసంభ్రమకారణము నీవేమయిన నెఱుఁగుదు..

చంద్ర- గుణగ్రాహురాలవగు నీవనుగ్రహించవలెను. నేనుచేరనకే పెద్ద..

ల- అటులయిన నేమగందు మిగుల వన్నెలకుప్పగదా! నీవెట్లు,

మధురవాణి- మీలోనమీరు కయ్యములాడుటయే కాని శశిరేఖ వంత బాపరైరి.

చంద్ర- ఆపనినీది. తేనెలొలుకు తియ్యనిమాటలచే సఖురాలి సందియము వాపగను

మధు- సరే, నీమాట నేల వ్యర్థము సేయవలెను. నాకిట్లుతోఁచుచున్నది వినుఁడు.

గీ॥ వయసువచ్చినతోడనె వనితలకును

మగనిజతఁగూర్పఁగోరెలకో మహినిబ్రజలు ॥

చంద్ర- (చప్పట్లుగొట్టుచు) ఆ! తెలిసినది! శశిరేఖ మనోవ్యథకు కారణము నాకును తెలిసినది!

గీ॥ బంతులనుమీజేకుచములీపగిదినుండఁ

బాపమీబిడ్డ మనసెట్లువశమునొందు ॥

శశి- (కోపముతోఁగూడిన చిఱునగవుతో) మదవతులార! మీతోఁజనవిచ్చి ముచ్చ టించుట నాదేతప్పు.

శిల- అబ్బ! మన స్త్రీజనమునకున్న మహాధనమే యీబెట్టు! తల్లిపుట్టిల్లు మేనమామకె ఱుకయన్నట్లు నీనక్కజిత్తులన్నియు నాయొద్దనా శశిరేఖా? విను మఱి-

గీ॥ బలియుఁడునురూపవంతుఁడు భాగ్యశాలి

యైనమగనినిగూడిసౌఖ్యంబునొంద

నమ్మరో! చిత్తచాంచల్యమూవలుంప,

నిమ్మతదుద్దిస్వర్గనిభమ్ముగాదె ॥

శశి- (అఱమోడ్పుతోఁబారవశ్యమునొంది) అమ్మలార! చల్లకువచ్చి ముంతదాఁచ నేల? నేనును నాప్రాణనాథుఁడైన (నిట్టూర్పుపుచ్చుచున్నది-)

శిల- చెప్పుము- చెప్పుము- అభిమన్యుఁడును-

శశి- (లజ్జాహాసములతో) యింతనాటనుండియుఁ గలసి మెలసి యాడికొనుచుంటి మిగద! ఇప్పుడీరాణివాసమను కారాగృహమునఁబడి యామహాభాగునిఁజూడ కుండ నెన్నినాళ్లు గడపఁగలనో?

మధు- అమ్మా! ఎప్పుడును సంతతసాన్నిధ్యముచే నంతమోహముండదు. [illegible] నన్యోన్యదర్శనాకాంక్షచేఁ గ్రాలించినఁగాని యాననాంగ్య[illegible] గనుండదు. దైవానుగ్రహమునఁ గతిపయదివసములలో నీప్రియునిచే గాఢాలిం గనప్రసన్నమానసమైన సామ్రాజ్యమునఁ దేల్చఁబడెదవులే.

శశి- ఆహా! ఏమి తేనెలొలుకుచు నాపరితాపముఁ జిరవే నీతియ్యమాటలు ! ! ఏమైనను నామనస్సంతకంతకు వశముదప్పుచున్నది- "గతకాలము మేలువచ్చుకాలముకన్నన్" ॥ అనునటుల వెనుకటిదినములన్నియు దాఁగుడుమూఁతలచేతను, గుజ్జనగూళ్ళచేతను, బొమ్మలపెండ్లిండ్లచేతను' అతిసౌఖ్యముగ వెడలింపఁబడినవి- (సబాష్పగద్గదికముగా) ఆదినములిఁక జూడఁబోముగద ! ఇప్పుడంటివో! యసంఖ్యాకములగు మనోవ్యథలునన్ను బాధింపఁదొడంగెను. నాకిప్పుడేమియోగాని మిన్నువిఱిగి మీదఁబడినట్లున్నది- ఏమి సేతును ?

చంద్ర- అశేషజనరంజకంబగు నుద్యానవనమునకుఁ బోవమురమ్ము. అచ్చట సుఖముగఁ బ్రొద్దుపుచ్చెదము.

శశి- సరే, మీయిష్టము- నడువుఁడు.

అందఱును (లేచినడుచుచున్నారు.)

చంద్ర- (ముందుచూచి) ఓహో ! సఖీ ! ఇదిగో యుద్యానము-

అందఱును-(ప్రవేశించిరి.)

శిల- తరుణీ! నీవలె నేత్రరుణమయిన జిగిగలయీయుద్యానవనముఁ జూడవమ్మా! ఇచ్చట.

గీ॥ బొడ్డుమల్లెలువిచ్చియీభూమినంతఁ
గప్పె సౌరభమదిగాక కప్పురంపు
టనఁటిచెట్లులసొబగునీయందమయిన
యీయావులతోడవియ్యమునొందుచుండె॥

మఱియు శుభసూచకంబుల నేకంబులు పొడగట్టుచున్నవి. ఎట్లంటివో?

మ॥ చెలి! చూతారుణపల్లవంబులనుభక్షింపక మదంబెక్కికో
కిలసంఘంబులుధూర్యరావములు నాగిపెట్టనీ తేంట్లు వే
శ్యలనన్ "రీ" యనిమేళగింపుసలుపన్ శశ్వత్కృణత్కారముల్
లలిస్వస్తుల్పచరింపువిప్రులనఁగళ్యాణంబు నీకొప్పెడున్॥

శశి- (నీరసభావముతో) ప్రియసఖీ! మందభాగ్యులకొక్కడ శుభమ్ము సేసుటునే? ఈయు
ద్యానమునఁ బ్రొద్దుపుచ్చుటకువచ్చిన నాకిచ్చట నేటికెదుఱీమటయైనదే!

ఉ॥ చూతములెల్లఁ బూయ, సిరిచూలియు వేరణలేఖవ్రాయ నెం
తోతమకంబుమీఱఁబికయూథముగూయ, ద్విరేఫసైన్యముల్

ప్రీతిగహో్రియ, నామనసుఖితినిమున్నెడు మందమారుత
వ్రాతము దేహమంతట నువహ్నివిధంబునఁగాక వెట్టెడున్॥

ఆహా! అలబ్ధఫల మనోరథులకివియన్నియుఁ బరమశత్రువులుగదా! (నిట్టూర్పుతోఁ జదికిలఁబడుచున్నది)

మధు- సఖీ! ఇంత చేతఁగానిపని చేయుచుంటివేమి? మానవతులు తమసౌందర్య సౌశీల్యాదులచేఁ బురుషులు తమకువశులగునట్లు సంచరింపవలయునకాని యిట్లు బేలతనము గానుండనగునా! (లేవనెత్తుచున్నది)

శశి- (అటునిటుఁ జూచి)

గీ॥ కడఁగి యేడాకు లనఁటినిగౌఁగలింపఁ
దాపవిశ్రాంతియానోకో ! తలఁచిచూడఁ
గానినాబోఁటిగత్తెకుఁగష్టమదియుఁ
దాపమార్పంగఁ గల్గుటతలిరుఁబోఁడి॥

(అప్పుడేటాకులనఁటి చెట్టును గౌఁగలించికొనియులికిపడి)

గీ॥ ఉవిద! సల్పఁగ సప్తపర్ణోపగూహ
నముదుస్సహతాపోపశమనమునకుఁ
గేవలంబుగ వైరుధ్యభావమొందె
హుతవహుశమింప వేల్చినఘృతమువోలె॥

మధు- ఇప్పుడు నాకొక్కయుపాయము తోఁచుచున్నది.

శశి- (తొందరతోడి దైన్యముతో) అదేమో సెలవీయుముతల్లీ!

మధు- ఆఁ! ఏమియీశశిరేఖయనునయము?

శశి- (కోపముతోఁ బుల్కుఫుల్కునఁ జూచుచు) పిల్లికిఁ జెలగాటము నెలుకకుఁ బ్రాణసంకటమనునట్లు మీరిప్పుడు నన్నుఁ బరిహసింపక మరేమిచేసెదరుఁ? (కన్నీళ్లు విడుచుచు) మీరింతకఠినహృదయలు

మధు- నెచ్చెలీ! కోపము సేయకుము ఎవ్వరికినియౌవనచాపల్యమే నీప్రియునియాకృతిని జిత్రపుఁబల్కపై లిఖించి చూచికొందువేని కొంత కాలయాపనము కావచ్చును.

శశి- (ఆలోచించి) సఖీ! (నిట్టూర్పుతో) అదికొనసాగదే? ఏమా?

గీ॥ వానియాననమాత్రంబె వ్రాయునంత

గుండెరుల్ల నియక్కటా! ఘోరముగను
గన్నులను వేఁడిబాష్పములు గ్రాఁచివేయఁ
బూను నా మొగమింకెటు పూర్తి సేతు॥

(తలపకించి)

కానిమ్ము! ఎంతకాలమైన వ్రాసిచూచెదను? (పలకపై వ్రాసి)

ఓహోహో! (అనిమూర్ఛబోవుచున్నది)

సఖులు- (పన్నీరుజల్లి లేవనెత్తుచున్నారు)

శశి- గీ॥ తెల్లఁదామరలనునవ్వికొల్లలాడుఁ
బొల్లిసద్వల్ల భాస్యమో చెల్ల వినవె
అదియుయుసాక్షాంతమాయసమ్మటైలాగు
భంగినా మనసునువశపఱుచుకొనియె॥

శశి- సఖీ! నీవు బొత్తిగనలసియున్న దానవు. కొంచెము సేపీ సెజ్జపై బవళించి నిద్రించుము. చింతైకాగ్రతతోనున్న నీకుకలలైనన్ ప్రియదర్శనమగును నేమి?

శశి- ఊఁ! అదియునట్టిదే.

గీ॥ వల్లభుఁ డెబాయాదావపావకునికన్న
నెక్కుడగు వేఁడిమనమును స్రుక్కఁజేయ
నెక్కడిదె నిద్రసుఖమేడ నింకయున్న
లోపమేమిటఁగల్గు నెలోల నేత్రి॥

కాబట్టి మనయీయారంభములన్నియు నీకనట్టివి. నేనొక్క పరమార్థంబు సెప్పెదవినుండు చంద్రుఁడులేక కుముదము వికసింపదు. కావుననప్పుడు శరణము న్పతియో.

సఖులు- అబ్బ! అట్టులనిమా కెందంబులు నీవు సేయకమ్మా.

శశి- లేక ప్రియజనగాఢాలింగనసుఖస్థితియో.

(తెరలో) తథాస్తు తథాస్తు

అందఱును- (చెవియిచ్చివినుచున్నారు)

శశి- మనచేటియగు సీమంతినివచ్చుచున్నది. ఏదో తీయ్యంబుమాట వినఁబడుచున్నది-

సీమంతిని- (ప్రవేశించి)

గీ = నీకుఁ బెండిలియయ్యెడు నీరజాక్షి
యెల్లి సుముహూర్తమనుచుని తల్లి నన్నుఁ
బెండ్లిసింగారమును జేయఁ బ్రేమమీఱఁ
దోడితెమ్మని నన్నంపెఁ దూర్ణముగను॥

శశి- (నిర్విశేషానందపరవశయై) చేటి ! ఈకంకణమును జేకొనవే- (అనియిచ్చు చున్నది-)

సీమం- (పుచ్చుకొని) అమ్మలార ! త్వరగారెండు

అందఱును- (లేచినడుచుచున్నారు)

సీమం. (ముందుచూచి) ఇదిగో గృహము. రేవతీదేవి నీకొరకై నిరీక్షించుచున్నది.

అందఱును- (లోపలఁ బ్రవేశించిరి.)

రంగము- రేవతీదేవియంతఃపురము.

(రేవతికూరుచుండి యుండఁగా సఖులతోఁ గూడ శశిరేఖ ప్రవేసించుచున్నది.)

రేవతి- (శశిరేఖను గౌఁగలించుకొని) పుత్త్రీ ! ఈదినమొక్కసారి యయినను గనఁబడ లేదెక్కడుంటివింతసేపు ?

శశి- తల్లీ ! ప్రొద్దుఁబుచ్చుటకై యుద్యానవనమునకుఁ బోతిని-

రేవ- సరే ! ఈపీఁటపైఁ గూరుచుండుము నీకలంకరించవలెను.

శశి- (పీఁటపైఁ గూరుచుండి) అమ్మా ! నాకీపునరలంకారకారణమేల ? నేనింతకుముం దేకద యలంకరించుకొనినది,

రేవ- అదియంతయు నలంకారముగాదు- ఇప్పుడునీవు వివాహాలంకృతవయ్యెదవు.

శశి- (తనలో) హృదయమా ! ఇఁకనైన స్థిమితపడుము-

రేవ- (అక్షతల్చేతఁబట్టుకొని)

క॥ నీయత్తకడుపుచల్లగ
నాయత మైమాతృగర్భ మదియునుచల్లే
యైయెల్లపుడొప్పెడుసిరి
రాయనికృపగల్గుఁగంతరాయరహితమై॥

(అక్షతలు శశిరేఖశిరముపైఁజల్లి) పరిచారకలారా ! ఇఁకమీరు వివాహయుత్సవ ములఁ జేసికొనుఁడు- నేనేగెద.

(నిష్క్రమించెను-)

శశి- సఖులార! ఇదియ నాకానందసమయము- సరస సల్లాపములతోఁ బ్రొద్దుబుచ్చు రమ్మా.

గీ॥ మనసుకోరికదీఱంగ మంచిసమయ
మిపుడచేకూఱెసఖులెల్ల నిచటనుండి
రహహ! యీసుఖమునకంటె నరయనెట్టి
సుఖముసుఖమనినెంతురేసుదతులార॥

మధు- మనసరససరసనుండ సరసములకేమికొదువ.

సరస- (తనలో) ఈమెనాకే తాటియాకులు గట్టుచున్నది- దీనిసేరీతినైనను జిన్నబుచ్చెదను- (పైకి) మధురవచనా! నీపెదవియందేదో గంటుకనఁబడుచున్నదేమమ్మా?

మధు- గీ॥ కల్కి! రాజిల్కసుధజిల్కఁ జిలికిపలుక
ప్రేముడించిముద్దాడంగఁ బెదవిఁ గఱచె

సర- ఓ! గీ॥ పత్తులకుఁబండ్లపైఁబ్రియ భావముంట
దొండపండనికాఁబోలు తోయజాక్షి॥

శశి- సరసవచనా! మధురవాణి వివాహమయినచిన్నదిగదా నీకీయనుమానమేల నే?

మధు (రబ్బసముతో) అవును లే నీకును రేపటితో నాయాటంకముతీఱును గా!

శశి- (వెనుకకుఁజూచి) ఇదిగో మనచంద్రికవచ్చుచున్నది.

చంద్రిక-(ప్రవేశించి) సకియా! ఏమిచెప్పుదు నీయదృష్టము!

సీ॥ శాకాసనాయిలుబాగుగా మ్రోయంగఁ దూర్యరావమ్ములతోడమించి
తెల్లవాఱినభంగి దిశలెల్లదీపింప వేలుమత్తాబులు వెల్గుచుండ
దేవాంగనాసమదేహలువేశ్యలు చిత్రలాస్యంబులు సేయుచుండ
వందిమాగధరాజి వందనంబులుసేయ సకలవిద్వజ్జన సహితముగను
విపులరథ హయ గజ సైన్య విస్తరాతి
పాదఘట్టననిర్గతబహుపరాగ
చుంబితాకాశులైకడు సొంపుమీఱ
వచ్చివిడిసిరికురురాజ వైపువారు॥

శశి- ఆశ్చర్యమాశ్చర్యము!! పాండవులకును గౌరవులకునుబద్ధవైరముకాదటే? అట్టియె

డఁబాండవకార్యమునకుఁ ॥ గురురాజువైపువా, కేలవచ్చెదరు?

చంద్రి- ఇదికడుఁజిత్రముగనున్నది! బలరామపుత్రికయైన నిన్నుదుర్యోధనపుత్రుఁడైన లక్ష్మణునకిచ్చుచుండ నిందుఁబాండవులెచ్చటవచ్చిరి? వారడవులలోనె.

శశి- (విషణ్ణతతో) నిజమే నాసఖీ! (తొందరపడుచున్నది)

చంద్రి- నీతో నేనెప్పుడైననబద్ధముసెప్పితినో?

శశి- (దేహముకంపించినోటఁదడియారగద్గదస్వరముతో) హా? పాపపుదైవమా! నేనేమి తప్పుజేసితినని నన్నిట్లుమరణశరణముగాఁజేసితివి? (అని నేలఁబడియేడ్చుచున్నది)

సఖులు-(నిరుత్సాహలయివిన్నబోయినముఖపద్మములతో) అమ్మా! లెమ్ము. ఇంకనువిచారించినిజమునుదెలిసికొందము. అంతకునదియేనిశ్చయమయినచో సిట్టివిరోధులగు తలిదండ్రులతోడిపొత్తునీకేల? మన్ననయేల? ఎట్లులైననీకోర్కెఁజెల్లించెదము లెమ్ము.

శశి- (లేచి) సఖీ! నాకేమియుంగానరాకున్నదిసరే! ఇక్కడదనునామనోరథమంతపూర్తియయినది. మఱినాప్రాణసముఁడయిన సుభద్రానందనుఁడెచ్చట నేమిసేయుచున్నాఁడు?

చంద్రి- ఈవార్తనువినఁగానేతల్లితోనడవులకుఁబోయినాఁడు.

శశి- కష్టమహాకష్టము! అయ్యో! క్షతముపైక్షారముగూడపడినదా? ఓప్రియతముఁడ! పూర్ణిమాసుధాంశునిబోలునీమెమ్మగమిఁకఁజూతునా?

(అనిమూర్ఛబోవుచున్నది)

సఖులు-(అనేకశైత్యోపచారములసేఁదఁదేర్చుచున్నారు)

శశి- (లేచి) తండ్రీ! నీకింతవిరోధినైతిని! ఓతల్లీ! లోకములోఁదండ్రులెట్లున్నను దల్లులుపిల్లలఁబ్రాణతుల్యలుగఁజూతురనియెదరు. అట్టియెడనీవునుచేదైతివో? సుయోధన! నీకుమారునకునన్నుఁగూర్పఁబోవుట కాకిముక్కునకుదొండపండు గట్టుటగదా! లక్ష్మణా! ఆలభ్యారంభము జమిమానీకోరిక! హాప్రాణనాయక! నాతండ్రిధనికవశంవదుఁడై నన్నీయనన్నంతమాత్రమున నన్నుదరిలేనివియోగసాగరమునముంచిపోనగునా? నామీననేమికట్టితివి? దానినినీకిదివఱకేయిచ్చియుంటినికాదా? అయ్యో! మధ్యవారికేమికొఱత? వారెటులైననునులే. (సఖులవైపుఁజూచి దీనముగా) ఓసఖీ! ఈప్రపంచకమంతయు గాఢాంధతమఃపరిపూరితమయినట్లు

న్నదే. (ఉలికిపడి) అబ్బ! ఏమి యీ మలయవాతము! నిప్పులుగురియుచున్నది గదా! (దక్షిణదిశోన్ముఖియై) ఓచందనజన్మ! మహాభాగ!

గీ॥ దక్షిణంపు దిక్కు యమునకు స్థానమండ్రు
తలఁపనీకును స్థానంబె దానఁ జేసి
యేకసంస్థితిదోషమ దేడఁ బోవుఁ
బ్రాణిహింసయె యెప్పుడుఁ బనులు మీకు ॥

[అప్పుడు చంద్రముఖిని గాఁగలించుకొని]

పంచచామరము- సరోజనేత్రి రో సఖీ ప్రచండమారుఁ డేఁచియా
ద్విరేఫకీరశారికాదివీరసేన గొల్వఁగన్
గరంబు నా యురంబు నేఁడు గాశరంబు బూనెనో
వరాళివేణి సేవిరాళి బారిఁ దాళనేకటా ॥

(ఆకాశము వైపు చూచుచు)

హా! కామదేవ! సంకల్పసంభవ! పుష్పబాణుఁడవైన నీకింత వేఁడి యెచ్చటవచ్చినదోయి? నేనొక్కటి యూహించెద.

గీ॥ తొల్లి శివఫాలవీతిహోత్రుండు సోక
భస్మమాత్రుఁడవైతివి భావజాత
దాని లేశము నీవింక దాఁచియుంటి
వేమొ! లేకున్న నీ తాపమేలఁ గల్గె॥

(సక్రోధముగాఁ దలపంకించుచు) కానిమ్ము అబలనగు నా శాపము ప్రతిహతము చూడుము!

గీ॥ నీదు పువ్వులతూపులు నేలఁ గూలు
నీదు మీనంపుఁ డెక్కెంబు నీటఁ గలయు
నీదువిల్లెడు భక్ష్యమై నీరసించు
నాదు దటిఁ జేరకో రోరి నయవిదూర॥

ఓ మానసోద్భవ! నీవు పుట్టినిల్లు మట్టుపెట్టఁ జలపట్టుపట్టినకట్టెఁడివి. నామానంబునఁ బుట్టి దాని నే యారడిపెట్టుచుంటివి, దుష్టజంతువులను పలాలనంబు సేయఁ జనదు. పాముకుఁ బాలుపోసి, పెంచినటులఁ బ్రియజనసమావేశాశంకాపరంపరలచే నిన్నుఁ బెంచితి. నిప్పుడీవు నన్నారకపిడి పెట్టెదవా? (అప్పుడు క్రీడాశుకమొక పకపకనవ్వ నదిరిపడి) ఓసీ పక్షీ! ఏమి

వాఁగెదవే! చిన్ననాటనుండియు నాచేఁ బెంచఁబడియిప్పుడు మన్మథునిఁదత్తడివైతివని కాబోలు నన్నుఁ జిక్కుపెట్టుచున్నావు! సరే! మంచిదిలే! (కొంచెమాలోచించి) అమ్మలారా! నాకేమిగతిఁ జెప్పెదరు?

శిల- అమ్మా! నీతండ్రి తానుదుర్యోధనుని వియ్యంకుఁడననిపించుకొనఁ జూచినాఁడు గాని నీయష్టమెట్లో యించుకయు యోచించినవాఁడు గాఁడు. అట్టిస్వలాభప్రవణుఁడగు తండ్రి తండ్రియో? అదియునుఁగాక నీవుత్రికరణశుద్ధిగ నభిమన్యువరించితివి. ఇప్పుడువేఱొండుపురుషునిగూడితివేని దోషము వాటిల్లును. పతివ్రతలయినయుత్తమ నాయకలుతామువలచినవానినగాని యెట్టియిక్కట్టులయందైనను వేఱొకనివరించరు. కాఁబట్టి నీవిప్పుడొకపనిఁ జేయుము. జాబునొకదానినివ్రాసి నీప్రియునకుఁబంపుము. ఇదివఱకునీయనురాగమునంతగాఁ జవిచూడనందున నిన్నువిడిచిపోయినాఁడు. నీజాబునుజూడఁగనే వచ్చినీకోర్కెఁదీర్పఁగలఁడు.

శశి- అవును నిజమే అట్లుచేసెదను అతఁడువచ్చి నరాఁగలఁడు కానినాఁడప్పుడప్రాణత్యాగము సేయుదానను.

(జాబువ్రాసిత్వరగతియను చేటికిచ్చియనునయపూర్వముగా)

చ॥ త్వరగతి! నీవువోయియలపార్థజుఁగాంచిమదీయవార్తలన్
సరణిగఁ దెల్పి వానిమదిజక్కఁగఁద్రిప్పియొకైననీకుచా
తురిఁ బ్రచురించుచుం బ్రియముతోఁగలనేర్పుల బుజ్జగించినా
స్మరజదవాగ్ని నార్పఁగనుసత్వరఁ దేగదెసన్నుతాంగునిన్॥

(అనిచేతనున్నరతనాలకంకణమీయఁబోవుచున్నది)

చేటి- అమ్మా! నీచేతికంకణము నీయకుము. నాకునీయనుగ్రహమే కావలయును.

శశి- (చేటిచేతులుబట్టుకొని) అమ్మీ! త్వరగారావలెనుసుమీ!

చేటి- వేయేల? చూచెదవుగా! అచ్చటభుజియించి యిచ్చటఁ జేయికడిగికొనునట్లు వచ్చెదను. సరేగద! (నవ్వుచు) నాపేరెవరు? హుఁ! (నిష్క్రమించెను)

శశి- (నిట్టూర్పుతో నాకసమువంకఁజూచి) అబ్బా! ఈపాపఁపుచందమామయు బయలుదేతెనాఁడే! ఓరా! చంద్ర! నిప్పులగురిసెదవే? మంచుకురియువగునీయుష్ణమెక్కడిదోయి? ఔను! నీకిదిసహజమేగా?

గీ॥ పాలమున్నీటఁజన్మించిపావనుండు
నీవునిరువురుసహజులై నెగడితిరిగ
కానసహజానుగుణ్యమువ్వకర్మ మీక
దెట్టులబ్బకయుండెడుకట్టచంద్ర॥

ఛారా! నీ పేరు మోసికొని బ్రదుకుచున్నన న్నేహింసింపవలెనా?

ద్విపద॥ హాచంద్రతారేంద్రహాదోషసాంద్ర
చూచుచుండఁగనింతచుల్కనబుద్ధి
లెటులఁగల్గెనో తెల్ప నేఁజాలనీకు
కుటిలాత్మనీతోడఁబూడిపుట్టిరిగ
యలపాలమున్నీట నైరావతంబు
తలఁపను ధాఘుటధన్వంతరులును
కౌస్తుభరత్నంబుకల్పవృక్షంబు
స్వస్తిస్వరూపిణిసర్వేశురాణి
వారలందఱునునీవలెజీవహాని
కార్యులై రోకో చూడుకల్మషహృదయ
నినుఁబామకఱచుటనీకళలన్ని
యొనువియచ్చరులుభక్షణసేయుటయును
మొదలుగాఁగల్గినమోసంబులన్ని
యొదవకుండినసునీవొదిగియుండెదవె
హరుబండిచక్రమ్మైయమరినఁగాని
మరణంబునొందకమఱియొంటిపెట్లు
గురుభార్యఁబొందినఘోరుఁడవగుటఁ
జిరజీవివైయిట్లుచెలఁగుచుండితివో
అక్కటా ‘‘పాపీచిరాయుః’’ వన్మాట
నిక్కమయ్యెరా యామినీచర శ్రేష్ఠ॥

(చేతులుజోడించికన్నులుమూసి)

ద్విపద॥ హాదైవమాయిట్టియాపదనాకుఁ
బాదుకొల్పుటనీకుఁబాడిగాదకట

యెప్పుడేపాపంబు నేఁ జేసినాను
యిప్పుడీవెతలకు నెఱఁ జేసినావు
అక్కటాః రహాబ్ధియడుగున ముంచి
యిక్కరణిఁగ నేఁచ నేమి న్యాయంబు
నీకింత నాపయి నిష్ఠురమున్నఁ
జేకొని యొకసారి చెండాడరాదే॥

(యెలుగెత్తి గద్గదస్వరముతో)

హా లోకరక్షక! నాపైనీకింతకక్షయేల? నీవింతశ్రమపడనేల? నిన్ను సుఖపెట్టుటకై నేనసిద్ధమయ్యెదను. చూడుము! (అని పైఁటకొంగుచే నుఱిబెట్టుకొనుచున్నది)

(అంతరిక్షమున)

క॥ చెలియా దుండగముడుగుము
పలుగాకులు మూర్ఖులెన్ని పల్కిన వినకు
త్పలపత్రేక్షణ! శ్రీకృ
ష్ణులదయ నభిమన్యుఁ గూడి సుఖియింతు బలే॥

శశి— (చెవియొగ్గి వినియాశ్చర్యహర్షములతో) ఓహోహో! నేనెంత పుణ్యముజేసికొంటినో! ఎండలో నెండి యుండియున్నవానికి మేఘాడంబరధ్వనివలె నీవాక్యము నామనస్తాపముఁ గొంతచల్లార్చినది! ఇదెవరువచించిరో! కొంచెము యోచించి ఇదియాకాశవాణి సూక్తిగావచ్చును. ఆకాశము పైఁ జూచి ఓయాకాశదేవత నీవాడితప్పనిదానవు తప్పకనన్ను నావల్లభునిఁ గూర్తువేని యిప్పుడ యీఘనాలంకారములన్నియు నీకుముడుపుగట్టి నీకీర్తిమాత్రము నానోటఁ గట్టికొనితిరుగెదను, కొంచెము స్తిమితపడి అబ్బ! ఇప్పటికొకతీరైనదే నామనోవ్యథ! సఖులారా! అమృతతుల్యమగు నీవాక్యము వినఁగా నేసుఖపారవశ్యమున నిద్దురవచ్చుచున్నది. పాపము! మీరును బోయి నిద్రించుఁడు. నేనును నిద్రించెదను.

సఖులు— అమ్మా! మానిద్దురకేమి? ముఖ్యమైన నీవు సుఖముగ మాకుదక్కితివి. ఇఁకమాకును సుఖనిద్రగలుగును సెలవిమ్ము.

అందఱు— (నిష్క్రమించిరి.)

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## చతుర్థాంకము.

### ఘటోత్కచాశ్రమము.



(నిలిచియున్న పింగళుఁడును మూర్ఛవడియున్న కరిబలుఁడును బ్రవేశించుచున్నారు)

పింగ- ఓహో! కరిబలుఁడు మూర్ఛవడియున్నాఁడు. (సమీపించి) ఓరీకరిబలుఁడ కరిబలుఁడ! (అని చేతితో బుజముపైఁ జఱచుచున్నాఁడు)

కరి- (కన్నులువిప్పిచూచి) నాయనా! పింగళుఁడవు కాఁబోలును ఈదినమున నాకరిబాలమంతయును గంగపాలైనది.

పింగ- ప్రాణసఖా! ఏమియట్లుగాఁజెప్పుచుంటివి?

కరి- చెప్పెదనుగాని ముందునాదేహమున నాటుకొనియున్న యీబాణములను బెఱికివేయుము.

పింగ- (అతికష్టముతో వలుగులనుపీకి) మిత్రుఁడా మెల్లగాఁజెప్పుము.

కరి- (నిట్టూర్పువిడుచుచు) ఏమిచెప్పుదునోయి! ఈదినమునఁ జంద్రబింబమును దొంగిలి ముఖము గనఁబుచుకొనిన యొకసుందరియు మన్మథుని యపరావతారమగు నొకపుత్రుఁడును మనవనముఁ బ్రవేశించిరి.

పింగ- నరులకీ యరణ్యముగమ్యమే! ఎట్లువచ్చిరి?

కరి- పింగళా! మొదటినుండియు నీగుణము లేనిపోనిప్రశ్నలువేయుట కాటపట్టే నేనో? ప్రస్తుతము కొనయూపిరితోనున్నాను. నేఁజెప్పెడుమాటలు నోరెత్తక వినియెదవా వినుము, లేనిచో నన్నేలపీడించెదవు నాయనా?

పిం- ఆవును ప్రస్తుతమునీవు బొత్తిగ వీలుదప్పియున్నావు ప్రశ్నలు వేయనులే! చెప్పు పాపము! !

కరి- ఆచిన్నవాఁడు నిర్భయుఁడై మనవనమంతయుఁ దిరుగుచు మాగాఢావరోధములగు వృక్షములను నఱకుచునుండుటఁజూచి యానరులనిరువురఁబట్టుకరండని మనప్రభు వగు ఘటోత్కచుఁడు నాకాజ్ఞనీఁగా నరమాంసములభించెనను ప్రీతిమనమున ముప్పిరిగొననట్టహాసము జేయుచు బిలబిలఁజనుదెంచువఱకెచ్చటనుండియో యొకబాణవర్షము గుబగుబవచ్చినది. నేనంతఁబడి లేవఁజాలక యిచ్చట గూలఁబడినీవు లేపఁగానూపిరిఁదెచ్చుకొన్నాను. తరువాత నేమిజరిగినదో నాకుఁదెలియదు!

పింగ- ఓరీ! గట్టిగానఱచకుము ఆరాచపిల్లవాఁడిప్పుడు మననెత్తిపై దైవమయినాఁడు.

కరి- (చివాలునలేచి) అదెట్లుబాబూ!

పింగ- నీవపజితుఁడవైనతరువాత స్వయముగా ఘటోత్కచుఁడే వచ్చినాఁడు అప్పుడు వారిరువురకును ఘోరయుద్ధమయినది. అన్యోన్యమపజితులుఁగాక బ్రహ్మాస్త్రప్రయోగములకై ప్రయత్నించుచుండ భగవంతుఁడగు వేదవ్యాసుండు ప్రత్యక్షమై వారిరువురకుఁగల బంధుత్వములు దెల్పిసంధిజేసినాఁడు.

కరి- ఔర! విపరీతము ఆబంధుత్వము చెప్పవేమోయి?

పింగ- మనరాజుగారి కామె పినతల్లియఁట- ఆకుఱ్ఱఁడామె సుతుఁడఁట. వారిపేళ్ళు సుభద్రయు నభిమన్యుఁడు నఁట-

కరి- (ఒకానొకవిలక్షణమైన వింతతీరునభినయించుచు) కాఁబట్టియే బాబూ, నన్ను జెత్తతేఁగఁగొట్టి-

పింగ- (చూపునిగుడించి) ఓరీ ఇఁక నోరుమూయుము అప్పుడుకాదిప్పుడు తేఁగును మనచెత్త మనరాజును సుభద్రయు నభిమన్యుఁడు నిక్లైవచ్చుచున్నారు- లే పోదము- (నిష్క్రమించిరి) ఇదివిష్కంభము-

(యథానిర్దిష్టముగా సుభద్రాభిమన్యుఘటోత్కచులు ప్రవేశించుచున్నారు-)

ఘటో- వత్స! నిన్నెంత తూలఁగొట్టితిని నేను గడుఁబాపినైతినిగద-

క॥ తమ్ముఁడ! మృదువగునీదే
హమ్మునునిశితాస్త్రపంక్తి నలయించికదున్
సొమ్మసిలఁజేసినట్టిక
రమ్ములనిందలప నాకరమ్ములుగావే॥

క॥ ఆడవులనిటు సిరులకుఁగడు
నెడమైపడిపోవుచుండ నింకయు నేమం
బడిగిమిము నాదరింపక
వడిఁ గొట్టెదునన్నుఁబోలు వాఁడుంగలఁడే।

అభి- అన్నయ్యా! నేనుమాత్రమేమిచేసితిని నీవు పెద్దవుగనుక నెఱుఁగకనైనను నన్ను శిక్షించవచ్చును నేనెఱుఁగకనైనఁ గలనైనఁ బెద్దలఁ దిరస్కరించఁగూడదుగదా! అట్టిమొదమీపట్లనైన నాయవిధేయతను ముమ్మాటికి మన్నింపవలెను- (అని పాదములపైఁబడుచున్నాఁడు-

ఘటో- (అభిమన్యుని లేవఁదీసి శిరము ముద్దాడి) వత్స! కమలాకరము మకరందముగాక మఱేమిజిలుకును? (సుభద్రవైపుతిరిగి) అమ్మా! బుద్ధిలేమి మిమ్ములశ్రమపెట్టితిని రక్షింపుము- (అని పాదములపైఁబడుచున్నాఁడు)

సుభ- పుత్ర! దుర్వారమగు దైవము చేయించెడుపనులు జేయుచుందుము- నీతప్పేమున్నది- దీనిని మఱచిపోదమ్ములెమ్ము-

ఘటో- (లేచి) అయ్యో! ఎట్లు మఱవఁగలను?

ఉ॥ తల్లిరో! యిట్టివారలనుబిత్తలవినవారినిఁ జూడనెట్టులన్
జెల్లును నేఁడు నేనిటులఁ జేసితినంచెటుదెల్పఁగల్గుదున్
దల్లడమొందిమీరిటుల పావనభూమికి రాఁగరండటం
చల్లనసేదదేర్చి తగినట్టిసపర్యలొనర్చనైతిఁగా ॥౪

సుభ- నాయనా! గతజలసేతుబంధనమునఁ గార్యమేమి?

ఘటో- అమ్మా! నాసౌధమునకుఁబోదమురండు
(అందఱును) నడుచుచున్నారు.

ఘటో- (ముందుకుఁజూచి) ఇదేనాసౌధము నాతల్లిహిడింబియు నాకైవేచియున్నది- లోపలఁబ్రవేశించుఁడు-
[అందఱునుబ్రవేశించిరి)

(అప్పుడు హిడింబి సింహాసనస్థయై యుండ సుభద్రాభిమన్యులతో ఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాడు.)

హిడింబి- నాయనా! వీరెవరు?

ఘటో- అమ్మా వీరు నీమఱఁదియగు నర్జునుని దార పుత్రులు.

హిడింబి- (తొందరతో) ఏమీ నాచెల్లెలా ? సుభద్రను గౌఁగలించుకొని యభిమన్యు
ని శిరముముద్దాడి ఇవిగో యీయాసనములఁగూర్చుండుఁడు-
అందఱును కూరుచున్నారు-)

ఘటో- (సుభద్రతో) తల్లీ !

గీ॥ ఫాలనేత్రుని గెల్చిన పార్థునకును
దారవయ్యును లోకైకవీరుఁడనగు
నాకుఁ బినతల్లివయ్యుఁ గాననము వెంట
నక్కటా నీవు రానేల నమ్మ నేఁడు ॥

సుభద్ర-(తలవంచుకొన్నది)

అభి- (అతికష్టముతో) అన్నా !

మానిని॥ ధర్మసుతాదులు దైవవశంబునఁ దారడవిన్ వసియింపఁగదా
నర్మిలితో బలరాముఁడునన్ను మదంబనుదోడ్కొని పోవనటన్
ధర్మము మీఱక ద్వారకమాతులధామము నందున నుండఁగఁబ్రో
క్కర్మవశంబునఁ గాసిలి యిట్టులఁ గాఱడవింబడి రాఁగలిగెన్ ॥

ఘటో- (కోపముతో లేచి) మీకుఁ బ్రతికూలఫలదమగు నట్టి కారణమేమి?

సుభ- నాయనా! ఏమిచెప్పుదును (సభాష్పగద్గదికముగా)

సీ॥ బలుఁడాత్మపుత్రినిఁ దొలుత నా పుత్రునకిచ్చెదనని వచియించియిప్డు।
కఠినతవహియించి కౌరవపుత్రునకిచ్చెదనంచు వాక్రుచ్చినాఁడు॥

ఘటో- (కనుబొమలుముడివేయుచున్నాఁడు)

సుభ- పోయెఁబో గాంధారిపుత్రు నే పల్మాఱులింతలంతలుగ వర్ణించినాఁడు.

ఘటో- (పండ్లుపంటపటగీచుచున్నాఁడు)

సుభ-సీ॥ అక్కటా! మహనీయులగు నీదుతండ్రులఁ బేరు పేరులఁ దిట్టిప్రేలినాఁడు.

ఘటో- దేహమునుండి పొగలూదుచున్నాఁడు.

సుభ- గీ॥ ఏమిచెప్పుదుఁ బుత్రకా యిట్టిమాట (కన్నీళ్ళనొత్తికొనుచు) కూఁడుగుడ్డలె
లేవాయెఁ గోడలేల? కడుపుఁగూటికినాయిలు గాచియుండి! యిట్లు ప్రేలిననవ్వా
లికీడ్తుననిరో॥

ఘటో- (పట్టరానికోపముతో నొక్కిపెట్టుచునాదిగ)

మ॥ అవురా! మేలు! శబాసయారె! బలుఁడౌహో! యెంతవాఁడయ్యె నా ।
హావధుర్ధర్షధనుఃప్రకర్షకర్షణాహం కారఘోరస్ఫుర ।
న్నవనానావిధచిత్రశస్త్ర రచనానైపుణ్యమాయారణ ।
వ్యవహారజ్ఞుఁడనన్నునైన మదిలోభావింపకిట్లాడెఁగా!॥

క॥ ఐనం గానిమ్మాయవ ।
మానముమానంబెమనకుమానముదుఃఖం ।
బానయహీనుని నిమిషము
లోనవమానించివత్తులోపలు మెచ్చన్॥

(అభిమన్యునిఁజూచి)

తమ్ముడా! నీపరాక్రమేమో యత్యధికమనియింతదనుకసంతసించుచుంటినే వ్రేలు గఱచికొని నీరసభావముతో లోకైకవీరుఁడనగు నన్నెడీల్చితిచిన నీయస్త్రజాలము నీ ప్రతికత్తులపై బనకుండుటకుగారణమేమి అయ్యో ఎంతచిన్నతనపుఁ బనిచేసితివోయి బలరాముడుల్లనీయాకన్న బోనిమ్ము అతనికేపిల్లలుగలరు ముఱియనిమ్ము మహాత్ములగు పాండవులు నట్టికాఱులు వ్రేలుచుండ నెట్లుసహించితగుదునని యిట్లువచ్చితివోయి? (తలపకించి) కానిమ్ము తొందరేమి (సుభద్రతో) అమ్మా! ఇంకను బెండ్లికాలేదుగద?

సుభ- లేదులేదు ఈపేసుముహూర్తము-

ఘటో- ఆఁ అట్లయిన నాచేయుప్రతినవినుఁడు-

చ॥ నిజముగవాయుపుత్రునికి నేనతనూజుఁడనైతి నేని నా
ప్రజవభుజంగయుగ్మసమ బాహుపరిచ్యుతఘోరనారస
వ్రజమునసీరపాణికిఁగలబంధులనందఱఁ జిత్రభంగులం
గజబిజిజేసియిల్లగజగామిని నాసుముహూర్తవేళక
న్కజముగఁదెచ్చి తమ్మునికిఁ గన్యనబెండ్లియొనర్తుచూడుమీ! ॥

హరి హర హిరణ్యగర్భుల నైన నవలీలఁ బోదివి చెలంగు నామహిత మాయాప్రభుంమిల శశిరేఖనిప్పుడ తెచ్చెదఁను (కొంచెమాలోచించి) అమ్మా! ఇంతకును పిల్లవానికోరిక యెట్లున్నదో? ఒకవేళ నాపై మనయభిమన్యునివరించక కౌరవపుత్రు నేవరించియున్నచో నాచిన్నదిమనకువలదు- కాఁబట్టి ముఖ్యముగఁ బెండ్లికూఁతు కోరిక తెలియవలయును-

( తెరలో )

గీ॥ పెండ్లికూఁతునికోరిక పొందు లేక
తనరనభిమన్యునంచె చిత్తమును జేసి
సఖులతోఁగూడియెంతొ విచారమునను
విరహవేదనఁబొందుచు వేఁగుచుండె॥

అందఱును (చెవియొగ్గి వినుచున్నారు-)

సుభ- వారెవ్వరైయుందురు కుమారా

అభి- అమ్మా! ద్వారకాపురములోని త్వరగతియను చేటియొక్క కంఠధ్వనివలెనున్నది-

త్వరగతి- (నిట్టూర్పునిగుడించుచుఁ బ్రవేశించి) అబ్బ! బయలుదేఱినది మొదలెన్నఁడు వినిగ్రాయెనసుండనియీగాటంపుటడవులఁ దిరిగితిరిగి వేసారివీరిసంగతివారిని వారినిఁ బ్రశ్నించుచుఁ తుదకు వీరిని గనుఁగొనునప్పటికి నాతాతలు దిగివచ్చినారుగదా! కానిమ్ము! ఎట్టకేలకు సాధించితినిపో-

సుభ- చేటీ! ఇట్లిట్లు మఱేమియువిశేషములు లేవుగద? నిన్నుఁ జూడఁగ నేనానేత్రములు చల్లబడినవేయోసీ! ఆహా! చూచితివాస్వదేశాభిమానమెట్టిదో?

త్వర- విశేషములుమఱేమియున్నవి? మీరువచ్చినప్పటినుండియు శశిరేఖ మీకై బెంగబెట్టుకొనిదుఃఖించుచున్నది.

ఘటో- ఇఁకనేమి? నిమిషములోఁబోయి, పాపము! ఆపిల్ల దానిదుఃఖమును దీర్చెదను (నిష్క్రమించెను)

సుభ- (హిడంబితో) అక్కా! మార్గాయాసవశంబున నొడలునొచ్చుచున్నవి. ఒకింత శయనించి:—

హిడింబి- అయ్యో! చెల్లెలా నీవెన్నడడుగిడిరొందబెట్టియెఱుగవు నీకిక్కడ నెందరోపరిచారికలుగలరు. శయనింతువుగానిరమ్ము (అనియిద్దఱుపలోపలకు పోవుచున్నారు)

త్వరగతి- హర్షముతో నిదియేనాకుమంచిసమయము సౌభద్ర! చిన్నినాయనమునాంశియునీడుజోడుగనాడికొనియామెమనసంతయునపహరించియామెసుదరిలేనివిరహసాగరమునముంచియిట్లు తాఁజెల్లునా? చాలుఁజాలు! ఆపెనీయందలిమక్కువచే, దుఃక్కటమగుతాపమునమిక్కిలిగాఁ జిక్కువడుచున్నది. ఇదిగోనీప్రియురాలునీకులేఖవ్రాసినది.

(అనియిచ్చుచున్నది)

అభి- (అందిపుచ్చుకొనిసభావ్యగద్గదికముగాఁజదువుచున్నాఁడు)

ద్విపద॥ శ్రీకరగుణజాలసిందూరఫాల
కాకపక్షవిలోలకాంతకపోల
రాజమాన్యరాజరాజాతిపూజ్య
రాజరాజసుపూజ్యరాజసన్మాన్య
తేజోవినిద్రసుదేహసౌభద్ర
ప్రాణనాయకనీకుఁబ్రణతియొనర్చి
మానినిశశిరేఖమతియిట్లువ్రాయుఁ
జెలుతపాయమునుండిచేసినచెలిమి
తెలిగనేనాపయిదయయింతలేక
అయ్యయోయొకకంచమందునగుడిచి
శయ్యపైనొక్కటశయనించలేద
చెల్లబో! పురుషులచిత్తంబుకన్న
నల్లజాతికినైననర్తిలిగలదు
అక్కటా! విరహాబ్ధియడుగేలముంచి
యిక్కరణినిబోవనేమిన్యాయంబు
నాతండ్రిక్రూరుఁడైనన్నియ్యనన్నఁ
బ్రీతియెచ్చటికేగెఁబ్రియసఖయందుఁ
జిన్ననాటనెనాదుచిత్తంబుకొల్లఁ
గొన్నాఁడవిప్పుడుక్రొత్తేమివచ్చె
నీకంటెనన్యునినిఖిలేశునైనఁ
జేకొననొల్లనుసిద్ధంబువినుము
వైశంబనీముఖపద్మంబుజూప
నాలస్యమయ్యేనేనచ్యుతుతోడు
శశిరేఖపేరిటశశిరేఖగాని
శశిరేఖయుండదుజగతిలోపలను

దక్కనవన్నియు ద్వారకతినీకుఁ
జక్కగావినుపించుసవిశేషముగను॥

ఇట్లునీసఖురాలుశశిరేఖ.

(నిట్టూర్పువిడుచుచు) ఆహా! శిరీషపుష్పాధికసౌకుమార్యము గలయామిటారినా కొఱకెంతపరితపించుచున్నదోగదా! నేనెంతకఠినచిత్తుండనో

గీ॥ ఎపుడుకనులారఁజూతునాయిందువదన
నెపుడుభాషింతుఁగౌఁగిటనెపుడుసేతు
నెపుడుప్రేమనుశశిరేఖయిచ్చదీర్తు
హా! యింకెపుడన్నియునవలఁబోయె॥

క॥ రుచిరాకృతినవశశిరే
ఖచకితమృగశాబనయన; గజయాన; వినీ
లచికురశోభితనానే
త్రచకోరములకునువింపుగా నెన్నఁడగున్॥

(సవిమర్శనముగానుత్తరమునుబరిశీలించి)

చేటీ! ఇందక్కడక్కడనల్లనల్లనిబొట్లుకన్పట్టెడునివియాలేమ యంజనవికీర్ణములైన యశ్రుబిందువులుగాఁబోలునేమి? ఇచ్చట నా బాష్పబిందువులను మాత్రముజతగా— గలను (కన్నీళ్లువిడుచుచు).

క॥ సుందరమగునామేడను
ముందరశశిరేఖనిల్పి ముదమునసదరః
స్పందమ్మననుజెక్కుల
బొందుగముద్దాడునట్టిభోగముగలదో॥

(తలపంకించి) కానిమ్ము! అన్నియుదైవాధీనములే.

(తెరలో)

త్రిలోకైకవీరుఁడగు నాకీస్వల్పకార్యమెంతలెక్క?

క్షణములోఁబోయి బ్రహ్మకైనఁదెలియకుండ నామాయచేశశిరేఖందెచ్చితి

సుభద్ర, హిడింబి (అప్పుడుప్రవేశించి) ఔర! ఘటోత్కచుఁడప్పుడవచ్చినాఁడు!

ఘటోత్కచుఁడు— మంచముపైనిద్రించుచున్నశశిరేఖతోఁబ్రవేశించి.

ఉ॥ అమ్మరో చూడుమాశుగతినంబరవీధిబోయిద్వారకన్

సమ్మదమొప్పఁ జేరియలసాధ్వీకనామనుజంద్రరేఖనా
తమ్మునికిన్ సరూపగతిఁ దాల్చిన కోమలిఁ దెచ్చితింక నీ
కొమ్మను వేగఁ జూడుమిది కోడలొ కాక మఱింక నెవ్వరో॥

సుభ- (పరుగుపరుగునఁ బోయి మంచముపై నిద్రించుచున్న శశిరేఖ మేలిముసుంగుఁ గొంతవానీయఁ జేసి చూచి చిటికవైచి) ఓ! ఈపెయే నాకోడలు. ఈపె నాకోడలే.

ఘటో- "శుభస్య శీఘ్రము" మ్మనునటులనీ ముహూర్తముననే పెండ్లి గానిచ్చెద మఱియు శుభరేఖవ్రాసియింద్రాది దేవతలను గూడ రావించెదఁ జూడుఁడు (లేఖవ్రాసి) సేవకా! ధనుర్బాణములను దెమ్ము. దీని వాయువ్యాస్త్రముచే దేవలోకమునకుఁ బుత్తెంచెద.

సేవ- చిత్తము. (ధనుర్బాణములను దెచ్చి యిచ్చుచున్నాఁడు)

ఘటో- (ధనస్సున బాణము సంధించి ధ్యానమును నటించుచు)

గీ॥ అస్త్రరాజమ! నీ వేగియాశుగతిని
సకలసురగణములు నువాచస్పతియును
రంభ మొదలగు నప్సరోరాజితోడ
గాఁగఁ దోడ్తెమ్ము శతపతిఘనతఁ జూపి॥
(ఘోరధనుష్టంకారము జేసి యస్త్రమును లేఖతో విడుచుచున్నాఁడు)

శశి- (ఉలికిపడి తేచి తనలో) బాపురే! ఎక్కడిదీధ్వని? (కలియఁ జూచి) ఆశ్చర్య మాశ్చర్యము!

గీ॥ సకలరత్నస్థగితదివ్యసౌధమేడ
మఱియు నీఘోరకాంతారమధ్యమేడ
నక్కటా! ప్రియుఁ బోనాడి యడలుచుండ
తుతిని ఘోరము బోలె యీకష్టమేడ?॥

ఏమియీవింత? (మరలఁ జూచి) ఇదేమి? నా ప్రాణనాథుఁడు మొదలగువారు నిచ్చట గాన్పించుచున్నారే! నేమబంపిన త్వరగతియు నిచ్చట నేయున్నది. ఏ చింతతోఁ బండికొనిన నట్టికల వచ్చునంద్రు. కనుక నేనన్న నాసఖి "నీవు నిద్రించితి వేని నీనాథునిఁ గలలోఁ జూడగల" వన్నది. కాఁబట్టి యిది యొద్దిమేనికలగా వచ్చును. (కొంతతడవాలోచించి) అయ్యో! ఇదికల గాదు. నేను బ్రత్యక్షజ్ఞానముతోను

న్నాను. ఇదినిశ్చయమే. అఘటనఘటనా సమర్థుఁడగు భగవంతునివిలాస మిట్లున్నదిగాఁబోలు! ఔర్గా! నేనెంతయదృష్టవంతురాలనో! సరే! కానిమ్ము. ఆకాశవాణియవంధ్యవచస్కురాలుగదా! రక్షకుఁడగు పక్షివాహనుఁడు నాపక్షుముననుండనొక కుక్షింభరుఁడునన్నపేక్షించఁగలఁడా? (అనియత్యంతహర్షముతోకన్నులకొకవింతసొగసునీయదిగ్గునమంచమునుండి యురుకుచున్నది)

సుభ- (శశిరేఖచేయిపట్టుకొని) బాలా! భయపడబోకుము కుముదము చంద్రునితోగలసినది (లోనికిఁదీసికొనిపోవుచున్నది.)

ద్వార- రాజా! దేవేంద్రుఁడు నారదునితోడను సకల సురగణములతోడను వచ్చి గుమ్మముకడనున్నాఁడు.

ఘటో- శీఘ్రముగాఁ దోడితెమ్ము.

ద్వార- (నిష్క్రమించి మరల వారితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

ఘటో- (దిగ్గునలేచి) దేవరాజ! నమస్కారము దేవగురూ! నమస్కారము ఓసర్వలోకవంద్య! నారద! నమస్కారము.

అభి- (అందఱకునట్లనే నమస్కరించుచున్నాఁడు.)

అందఱును- వత్సలార! శుభమగుఁగాక!

ఘటో- అయ్యలార! మీరికనకాసనములఁ గూరుచుండుఁడు.

అందఱును- (యథాస్థానములఁ గూరుచున్నారు.)

ఘటో- (అభిమన్యునిఁజూపుచు) దేవేశ! ఇతఁడు సవ్యసాచిపుత్రుఁడయిన నీమనుమఁడు ఇతనికి బలరామపుత్రికయగు శశిరేఖను బరిణయము సేయుచున్నాఁడను. కార్యభారముచే నేను స్వయముగావచ్చి దేవరవారి నాహ్వానము సేయలేనయితిని మన్నింపవలయును మఱియు నిప్పటి ముహూర్తమాలోచించి కావలయును కావునఁ బెద్దలు ముహూర్తనిశ్చయము సేయుఁడు ఇంతశీఘ్రముగఁ జేయుటకుఁ గారణమేమనఁగా బలరాముఁడీతనికిఁ బిల్లనీయక దుర్యో-

దేవేం- హైడింబ! తద్వృత్తాంతము నాకువిదితమైనది నీవువిస్తరించి చెప్పనక్కఱలేదు. బలరాముఁడును గౌరవులును గూడ బహుగర్వితులై యున్నవారు! నీవుయోచించిన యూహ నాకుఁదెలిసినది. మంచిపనిఁజేసితివి.

(బృహస్పతి) అయ్యా! రేపు జాముపొద్దెక్కినతరువాత ముహూర్తము చక్క-

గానున్నది.

ఘటో- సరే! మీరీపెండ్లియారంభములను జేయుచుండుఁడు కౌరవ యాదవులు గడుం బ్రమత్తులైయున్నారు వారినించుక పరిభవించివచ్చెదను.

దేవేం- సందేహమేమి?

గీ॥ మామకాదులనందఱమాన్యతములఁ ।
బరిభవముచేసి మిక్కిలి ప్రబలియున్న ।
తుచ్ఛులనుగౌరవాదులనిచ్ఛమీఱ ।
నీశరమ్ములఁబొలియించు నేఁడువత్స ॥

సర్వథావిజయీభవ! నీవువైళంబపోయిరమ్ము

ఘటో- (తెరవంకఁజూచి) కరిబలా!

కరిబలుఁడు- (ప్రవేశించి) రాజా! ఏమితమయాజ్ఞ?

ఘటో- మనమిప్పుడు ద్వారకాపట్టణమునకుఁబోయి కౌరవయాదవుల నేడ్పించిరావలెను. కావున చతురమాయోపాయవంతులయిన రాక్షసుల సాయత్తముసేయుము మఱియు వారిని జిత్రవిధులం బరిభవించు టెట్లోయోచించుము.

కరి- మహాప్రసాదము క్షణముయోచించి) ఇదిగో యీయూహతోఁచినది (చెవిలో) ఇట్టిట్లు (అని చెప్పుచున్నాఁడు)

ఘటో- (పక్కునవవ్వి) ఓరిపిడుగా! గట్టియుక్తిపన్నితివిరా! శబాసు! సరే! అప్పుడునేను కవ్వునవఱచెదను అదియదనుగానా తుచ్ఛులదిగంబరులఁజేసి నన్ను గలియుఁడు ఇఁకనీవుబోయి నీప్రయోగముఁను నడుపుము నేనును బయలుదేఱుచున్నాను.

కరి- చిత్తముస్వామీ! నిష్క్రమించెను.

దేవేం- మ॥ భీమకుమార! నీవలగభీరపరాక్రముఁడై హాలాంకుఁపు ।
శ్రీమణిఁగోరివచ్చు కురుధీరులయాదవకోటినేఁచనీ ।
తామసమంతఁజూపుదొకో! తత్పురవాసుఁడునీలనీరద ।
శ్యామలకోమలాంగుఁడలశౌరిజూమీ! చనఁబోకుమద్దెసన్ ॥

ఘటో- అయ్యో! ఆలోకారాధ్యునేనెఱుంగనే? అమ్మా! నేనేగుచున్నాను.

సుభ- (లోపలినుండి రభసముగావచ్చి) నాయనా!

గీ॥ ఆగ్రహంబునఁగౌరవయాదవులకు ।

...యుం... ...కయ్యా!

కౌరవులఁజంపుప్రతినలుగలవునీదు।

తండ్రులకుయాదవులును బాంధవులునాకు॥

ఘటో- తల్లీ? అలాగున నేచేసివచ్చెదను.

అభి- క॥ అన్నా నీకిదితగునా

నన్నిటవిడనాడిపోవనర్థిలితోనీ

వెన్నంటివచ్చి వైరుల

నున్నులుమొనరింతునన్ను నుంగొనిపొమ్మా॥

గీ॥ తండ్రులరణంబుఁదీర్ణంగఁదటిదొరకెను

శత్రుసంహారమొనరించుసమయమాయె

నిట్టివేళ నెపగతుల నేఁచకున్నఁ

దండ్రికడుపునఁబుట్టిసార్థకమిఁకేమి?॥

ఘటో- నీపరాక్రమమట్టిదయయినను ఇట్టిస్వల్పకా...

యములోఁ బ్రత్యక్షముగా మామపైఁగత్తిఁగట్టఁజనదు నేఁబోయివచ్చెదను నీవి

చ్చటుండుము. (అంపజతోను) ఆర్యులార! అనుజ్ఞనిండు.

అందఱు- జయజయ.

ఘటో- (నిష్క్రమించెను.)

దేవ్లం- అయ్యా! ఇఁకమనము వివాహారంభములఁ జేయుచుండుమురండు.

(అందఱునిష్క్రమించిరి.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## పంచమాంకము.

రంగము, ద్వారకాపురములో నొకవీధి.

—:(అప్పుడు కరిబలుండను రాక్షసుండు ప్రవేశించుచున్నాఁడు.):—

కరి— కానిమ్ము! రాజాజ్ఞాప్రకారము రాక్షసులేనరుఁదఱను రంగులీను బంగారు సరిగవస్త్రములను జేసి పాంతబట్టలిచ్చిన గ్రొత్తబట్టలిచ్చెదననుమిష వెట్టి కౌరవయాదవస్త్రీపురుషుల వస్త్రములన్నియుఁ జేకిలుద్దసహితముపహరించి మాయా రాక్షస వస్త్రములంట బెట్టినాను! సమయమువచ్చినప్పుడు రాక్షసులందఱు వస్త్రరూపములను విడిచి వారినందఱను వస్త్రహీనులఁ జేసి స్వస్వరూపములతో నన్నుం గలియుదురు. నాయేలిక ఘటోత్కచుఁడును దనయరణ్యము బయలుదేఱి యీనగరమును బ్రవేశించి భగవంతుఁడగు శ్రీకృష్ణుని మందిరమునకుఁ బైనుంచియే వందనములుజేసి పిమ్మటనంతఃపురంబున మాయాశశిరేఖయై పవ్వళించియున్నాఁ డు మఱియు.

గీ॥ నీరజాక్షికిఁ బెండిలి నేఁడుజరుగు
గూర్మిబంధులతోడుతఁ గురువిభుండు
ఘాటిమీఱఁగఁ జనుదెంచి దైత్యబాధ
లోరువఁగలేక విముఖుఁడై యుఱికి చనును॥

(నవ్వుచు) ఇదినాకుత్సాహ సమయము. ఇప్పుడు మాయాశశిరేఖ సఖులతోము చ్చటించు చిత్రసంభాషణమును వినుటకుఁగాను నే నేగెదను. (నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము.

రంగము శశిరేఖాంతఃపురము.

(అప్పుడిరువురు ముత్తైదువులతో మాయాశశిరేఖ ప్రవేశించుచున్నది.)

ప్రథమ-శశిరేఖా ! నీవుమంచి యదృష్టవంతురాలవు సుమీ ! సకలబంధుమిత్రపరిజనయుతుఁడై రారాజుసను దెంచినాఁడు. పెండ్లిమంటపమలంకరింపఁ బడినది. సకలకౌరవ యాదవాధిపతులును సుఖాసీనులయి యున్నారు. నీభర్తలక్ష్మణుఁడును లెస్సగ నలంకరింపఁబడి యున్నాఁడు ఇఁకనీవు సంతోషముగానుండవలెను. ఆహా ! పెండ్లిపీటపైఁ గూరుచున్న లక్ష్మణునిఁ జూచి నాకన్నులు మిఱుమిట్లు గొన్నవే !

ద్వితీయ- అభిమన్యుఁడభిమన్యుఁ డోయని యొదవెందుకే శశిరేఖా ! ఇదివఱకే మాయన్నతో నినీవన్నమాటలను నీతోఁ ననుకరించితిమి గాని యిప్పుడు నీవెట్టిచూడఁగ నాకేత లకిక్కాగానున్నది. తుదకీతని యంగరక్షకుని కైనను. దూఁగువచే యభిమన్యుఁడు ? చూడు !

క॥ జిగిమీఱులక్ష్మణునివిధు
నగుమోమును మాఱఁగేరు నవరూపంబున్
వగగుల్కు వర్తనంబును
మగువా యీపృథ్విలోన మఱియొటఁగలదే ॥

యాశశిరేఖ- మీరుపరమమూర్ఖులు మీరట్లు ప్రేలికొను చుండుఁడు. నేను హాయిగ నిద్రించెదను (పండుకొనుచున్నది)

ప్రథమ- సకియా ! ఎప్పుడును నిద్రయేనా ? లే ! (చేతితోఁ జఱచు చున్నది.)

మాయాశశిరేఖ- (ఉలికించి లేచి) అబ్బ ! ఏమే యీ నుప్పుచ్ఛసంభాషణములు ! (కట్టార్పుతో) నన్ను సుఖముగా నిద్పురఁబోనియరేమే !

ఆ॥ వె॥ పెండ్లిపెండ్లియంచుఁ బ్రేలుచుఁగలతురు
కన్నులారనిదురఁ గొన్ననన్నుఁ
బెండ్లియున్న దెప్పు వీక్షించెదను గాక
ముండలార వదర కుండరేలే ॥

ప్రథమ- రెండవదానితో (రహస్యముగా) ఓసీ ! ఈశశిరేఖ విరుసచూడఁ గడుంగడుఁ జోద్యముగానున్నది. ఎప్పుడు నతిమృదూక్తులతో నాలాపించు నీపె యీది

నమునఁ బిచ్చియెత్తినదానిఁ బోలి పరుసాలాపము లాడుచున్నదిగదా !

ద్వితీయ- (రహస్యముగా) అభిమన్యువియోగ దుఃఖామర్షణంబున నిట్లు పరిభ్రమించు చున్నది సుమీ !

ప్రథమ- శశిరేఖా ! లక్ష్మణుఁడు మగండు గాఁబోవుచుండఁగ నెట్లుండవలెనో !

మాయాశశిరేఖ- (లేచి చిఱునగవుతో) లక్ష్మణుఁడిక క్షణములో నవలక్షణుఁడే యగునులెండు.

ద్వితీయ- సఖీ ! రారాజింటఁ గాపురము సేయునపుడు నేనువచ్చిన నాకుబంధుమర్యాదలుజేసెదవా ?

మాయాశశిలేఖ- సందేహమేమి ?

క॥ నా పెండ్లియయినపిమ్మట
పాపము లక్ష్మణుఁడు బ్రతుకు భాగ్యమెకన్నన్
లోపమెనీవటురాఁగా
నీపనిమొదలంటఁజేతు నిక్కముసుమ్మీ ॥

ప్రథమ- (కోపముతో)

క॥ వాఁడిగలకౌరవేశ్వరు
కోడలవై యుండలేక కుందెదవకటా
చేడెరొ ! యడవులఁదిరుగుచుఁ
గూడైనను లేనిపాథుల కొడుకేఘనుఁడే ॥

(తెరలో)

సుముహూర్తసమయమైనది. త్వరగాఁ బెండ్లికూఁతును రప్పించవలెను ముత్తైదువలు. ఇదిగోవచ్చుచున్నాము. (లేచి మాయాశశిరేఖతో నడుచుచున్నారు)

మాయాశశిరేఖ- (నాలుగడుగులునడచి యొకముత్తైదువ మీఁదఁబడినది.)

ప్రథమ- (నేలఁబడియున్నగఱచి) తనలో ఎప్పుడు నేడుమల్లెపూవులెత్తుతూఁగగు శశిరేఖ యీదినమున నింతభారముగానున్నదేమో? (లేచి కుంటుచునడుచుచున్నది.)

ద్వితీయ-(ముందుచూచి) ఇదిగో పెండ్లిమండపము. ఇది సకలబంధువర్గముతో నిండియుండుటచే మనము శిరికగుపడకయే దీని ప్రక్కగదిలోనికిఁ బోవలెను.

అందఱును-(లోపలఁబ్రవేశించిరి.)

# పంచమాంకము.

## రంగము-పెండ్లిమండపము.

(అందరును యథాస్థానములఁ గూరుచుండియున్నారు. లక్ష్మణుఁడు పెండ్లిపీఁట పైఁ గూరుచుండియున్నాఁడు.)

బలరాముఁడు- (అటునిటుఁ జూచి) సుముహూర్తసమయమాసన్నమగుచున్నను- మనరామభట్లుగారును- సదాశివుఁడుగారును రాలేదు.

రామభట్లు,సదాశివుఁడు- చేత బరిహాస్య మొదలగు పరికరములతోఁ బ్రవేశించుచున్నారు

బల- పురోహితులరాల! సమయమైనది. త్వరగా వివాహారంభములను జేయుఁడు.

పురో- ఇదిగో క్షణములో నే (నడుములుబిగియించి లక్ష్మణునొద్దఁ గూరుచుండి లక్ష్మణా! ఆచమనముచేయుము.

లక్ష్మ- (అట్లుచేయుచున్నాఁడు.)

రామ- (కొంతవివాహకాండజరిపి) ఓరిసదాశివుఁడ!

సదా- ఏమయ్యా!

రామ- ఓరిమూర్ఖుఁడ! ఏమో తెలియదా? త్వరగాఁ బెండ్లికూఁతును దోడ్కొనిరమ్ము.

సదా- ఓ, (అని వెడలుచున్నాఁడు)

బల- (విదూషకునితో) వయస్య! ఇదియే నాకుత్సాహసమయముసుమీ!

గీ॥ సకలబంధులువచ్చిరి సభకుసంతో
సమునఁబొందితివియ్యంబుసాటివీరి
నల్లుఁడారూపజితసుభల్లుఁడరయ
నిదియసాఫల్యమగుదినమిాభవమున ॥

దుర్యోధనుఁడు- రాధేయ! అదిగో కృష్ణుఁడును సాత్యకియు వెల్లనగుమోముతో మనదెస నేచూచుచున్నారు. ఇతని మర్మము నాకుఁ దెలిసినది. త్రాఁబక్షమువహించిన పాండవులకుఁ గార్యముగామినిఁక వారిని విడిచి మనలోఁ గలియు నుద్దేశముతోనున్నాఁడు. నేఁబిలిచిన నిప్పుడె గిరిగంతువైచును సుమీ ?

కర్ణుఁడు-సందేహమేమి? తుచ్ఛస్నేహములిట్టివే, కోఁతికాఁపురములవంటివి. మీరుమాత్రము పిలువవలదు, చూచినట్లుపేక్షించుటయే పరిభవము

దుర్యో- ఎందుకు పిలిచెదవు?

కర్ణ- బలరాముఁడిప్పుడు విశేషించి మృదువాఁడైనాఁడు. ఇఁక నీచిలుకనాయనను మూఁడుగడియలలో నవ్వులికీడ్చింతము.

సాత్యకి-(రహస్యముగా) అన్నా! వాసుదేవ! అదిగో చూడుఁడు. తులువలగు కర్ణదుర్యోధనులే మేమో మనలగురించి వేళ్లుకొనుచున్నారు. ఈతుచ్ఛుల యల్పఁపునీతి గుసగుసలువిని నేను సహింపలేనుగద! (కోపావేశముతో లేచి కత్తిదూసి)

పంచచామరము॥ పొరింబొరిందురాత్మసూతపుత్రునిన్ సుయోధనుం
గరేల్కరేల్లనంగ నాదుఖడ్గధారఁజెంచియున్
బరేతరాట్పురంబుచేర్చి ఫాలనేత్రశేఖరుం
గురూత్సుకుండనై రణంబుఁగొంతఁజేసి వేసెదన్ ॥

(కుప్పించి వారిపైకిఁ పోబోవుచున్నాఁడు.)

కృష్ణ- (చేయిపట్టుకొని రహస్యముగా) వత్స! నీకోపముజూపనిది సమయముగాదు. అదిగాక నీకుస్త్రమలేకయే

క॥ వెసనింకగడియలోనీ
గుసగుసలును గిసగిసలును గోల్పడిగోముల్
విసరించివీరలేరే
దెసలకుఁబారెదరొ చూడు తేఁకువ నెడగన్॥

సాత్య- (శాంతించికూరుచున్నవాఁడు)

రామభొట్లు- (ఒకవస్త్రమును లక్ష్మణునికడ్డముగాఁబట్టుచున్నాఁడు)

(తెరలో)

క॥ అమ్మ! యీపెండ్లికూఁతురమ్మోమ్మ గాదు
పట్టలేనంతబరువాఁరెుఁపట్టలోన

రామ- (ప్రక్కకుఁజూచి) జోస్సీ! ఓరిజోస్యిస్సి!

జ్యోస్సి- (ప్రవేశించి) ఏమినాయనా?

రామ- సదాశివునకుఁగొంచెము సాయము వెళ్ళు.

జ్యోస్సి- ఇదిగో! యిప్పుడువెళ్ళి తెచ్చెదను. సదాశివుఁడు మోదకఖాదనకేళనుండదు
(నిష్క్రమింతురు.)

(తెరలో)

గీ॥ ఇద్దఱకులాంగకుం డెనీయింటి యేమొ
కాని! చిత్రముదోఁ చెడుఁగల్కిపోల్కి॥
కానిమ్ము- చూతము. ఊఁ వీటితాతలు

జ్యోస్సిసదాశివులు- (మాయాశశిరేఖను దట్టలోనుంచికొని కేలుఁగేలఁ దోఁట్టుకొని ప్రవేశించుచున్నారు)

జ్యోస్సి- లెక్కా ? ఇందుకేలక్ష్యపెట్టెదనా ! వాలు[illegible] ! మా[illegible] ! [illegible] ధోఁకక్రియందుఁ బండ్లికిలించి అబ్బల్లో పెంపేయు [illegible] ! క్రిందఁబడవైచెద నానకనాబలాఢ్యత్వము చూతము (కట్టిగాఁబట్టుకొని) ఆఁ ! కొంతబరువు తగ్గినది. సదాశివుఁడ ! భయములేదు. తొందరపడకుము. మెల్లగా మెల్లగా.

ఉభయులు- (తట్టిదింపినారు)

రామ- (మాయాశశిరేఖను బెండ్లిపీఁటపైఁ గూరుచుండఁబెట్టి) అమ్మా! [illegible].

మాయాశశి- (అట్లుచేయుచున్నది)

రామ- (అక్కడఁ గొన్నివివాహకృత్యములఁ జేయుచున్నాఁడు)

మాయాశశి- (తెరచాటునుండి పెండ్లికొడుకు కాలిత్రేలఁ ద్రొక్కుచున్నది)

లక్ష్మ- (ఉలికిపడి పండ్లికిలించి తనలో)

గీ॥ లోకమంతన్నఁ గాంతల చేకలందు
రెంతవ్రుదహీనలయ్యారో ! [illegible]
పొందరే ! చూడనీకాంతపదముసోఁకె
బ్రతికితినిమాతృగర్భంబు బలిమికలిమి॥

అవురా ! ప్రాణములిప్పటికినిఁ గుదుటఁ [illegible] ఇప్పుడు నేనేదెనిఁ దొందరపడిన నలుగురు నగిరెదరు. [illegible] లుసోకినప్పటినుండియు విలక్షణమయిన [illegible] వొడముచున్నది. పెండ్లి[illegible] [illegible] పోయినది ఇదేదియో మార్దవమయియున్నది. దీనికాలు [illegible] నిర్వాచ్య [illegible] నన్నిప్పుడో [illegible] !

రామ- (ఉభయులమధ్య తెరఁదీయుచున్నాఁడు)

లక్ష్మ- (తేఱిచూచి గుండెలు చఱచుకొనుచు)

క॥ అయ్యారె యొక్కఁడి పెండ్లిది
దయ్యంబును గట్టిపెట్టఁ దగునా మీకీ
వియ్యం బెట్టులఁ జేసిరె
నయ్యో! నాతోడ హాస్యమాడుట తగునే? ॥
(తొందరపడుచున్నాఁడు)

దుర్యో- పుత్రకా! ఏమిట్లు భయపడియెదవు? మాకందఱకు దివ్యసుందరిగఁ గన్పట్టు శశిరేఖ నీకు దయ్యమెట్లయినదోయి? నిదురమత్తునను న్నట్లున్నావు. తెలివిఁ దెచ్చికొనుము.

లక్ష్మ- (స్థిమితముగా మరలఁ జూచి) ఆఁ! ఏమి యీ చిత్రము! ఇప్పుడు నాకన్నులకుఁ బెద్దపయ్యంబుఁబోలె కన్పట్టి యింతలోన దివ్యసుందరిగ మాఱినది! ఆహా! ఇప్పుడు చూడ నాకన్నులు మిఱుమిట్లు గొనఁజేయుచున్నదీ కన్నె చెన్ను! (అప్పుడత్రుళ్లిపడి) వాయనలార! (గద్గదస్వరముతో)

చ॥ సరగునఁ బెండ్లి సేతుమని సంతసమారఁగఁ దెచ్చి నన్ను భీ
కరమగు మీసముల్ లలిఁ గ్రక్కునఁ బండ్లికిలించు కోతికిన్
వరునిగఁ జేయఁబూనితిరె? వాహ్వారె! దండము మీకుఁ బెండ్లికిన్
ధరణి సజీవుఁడైననుగదా గృహదారసుతప్రియత్నముల్ ॥

దుర్యో- సభికులార! ఏమి యీ వింత? వెఱ్ఱియెత్తినవాడుంబోలె రోదనము సేయుచున్నాఁడు- తనలో నొకవేళ నీ చెలువ చెలువముఁ జూచి మోహావేశముచేఁ బరవశత నొందుచున్నాఁడేమో? (లక్ష్మణునితో) కొడుకా! నీవేయింత చేతఁగాని పని సేయుచుంటివేమి? ఇటులుండిన సభవారునగరే? ఇదిగో చూడుము! నీభార్య నిన్నుఁ జూచి యెట్లు నవ్వుచున్నదో! తిన్నఁగాఁ గూరుచుండుము.

లక్ష్మ- (మఱియుఁ జూచి తనలో) బలె! పెండ్లి యీసుందరాంగియయినది! సరే! ఇదివఱకైన భయమటుండనిమ్ము నేనపారఁబడుచుంటిని. ఔర! మాటిమాటికిఁ జూడ్కిఁ గోరిక పుట్టించుచున్నదీ చెలియ చూడ్కులు! (అంతలో నదిరిపడి) అయ్యవ్వో! ఏమిది? ఆఁ! ఉండుముండుము (పెద్దగొంతుతో) బాబో! నన్ను సింహము వాతవేసెదరా? నేఁబ్రదుకమీకిష్టము లేదేని నొక్కసారిగఁ జంపరాదే? ఇంతహింసయే

దుర్యో- పెద్దలార ! ఇతఁడెచ్చటనైన జడిసికొనియుండవచ్చును. మఱియుదృష్టిదోషము గూడతగిలియుండవచ్చును. కావునవేగమరక్షఁగట్టుండు.

రామ- నేనురక్షకట్టఁగట్టగలను నాకువేయిగదానికిదక్షిణరావలెను. (తనలో) నాకే మోభూతనాశనమంత్రములు తెలియునని మోసపుచ్చి, యెంతయునురక్షలుగట్టి డబ్బుగుంజుకొనుచున్నాను !;

దుర్యో- (అప్పుడొకబంగారు నాణెమిచ్చుచున్నాఁడు)

రామ- (లక్ష్మణునిబుజమున మంత్రపూతమగురక్షఁగట్టి) లక్ష్మణా! ఇఁకభయము లేదు స్తిమితపడుము.

లక్ష్మ- (స్తిమితముగాఁ గూరుచుండి మట్టెకలయెత్తి త్రుళ్ళిపడి)

ఉగంధి॥ కొండముచ్చు కొండముచ్చు గుబ్బుగుబ్బుమంచుబల్
కొండరీతివిక్రమించికొట్టవచ్చుచుండెహా
పిండియింతబొక్కుచుండిపెద్దపెద్దగోళ్ళచేఁ
గండలన్నిలాగుచుండెఁగర్మమిట్టులయ్యెఁగా॥

(ఏడ్చుచున్నాఁడు)

అందఱును- (సంభ్రమించికలకలశబ్దములతోఁగొణుగుకొనుచున్నారు)

లక్ష్మ- (కొంతధైర్యముతోఁజూచితనలో) ఆహా! వింత వింతరుచులనీనుచున్నదీ చెలియమోముఁదమ్మి! ఒకసారిదీనినాలింగనముజేసికొనినాదేహమును బవిత్రము జేసెదను. ఆవల నేమయినను గానిమ్ము (లేచిదొందరతో) హాశశిరేఖా! శశిరేఖ!

(అనికౌఁగలించుకొనఁబోవుచున్నాఁడు)

దుర్యో- (సరభసముగాలేచి చెయ్యిపట్టుకొని) కుమార! అబ్బ! ఏమియీకర్మము! నాకెంతటియవమానమును దెచ్చిపెట్టుచుంటివోయి!

గీ॥ రాజరాజనుబిరుదచేరమణకెక్కి
యఖిలజగమేలునాకపత్యంబవయ్యు
నక్కటా; చేలవైయిటులాచరింపఁ
జెల్లునేయెల్లబంధులుఛీయనంగ?

లక్ష్మ- ఉండుముండుము. నీఛీలునుగీలును తెలుపుచూతము. (చేయివిడిపించుకొని) శభాస్ అగుఁగాక! ఆతురముతోఁగౌఁగలించుకొనఁబోఁధు) ఇస్సీ!

అ, వె॥ జడలవయ్యమగుచు సాగిహుమ్మను చును
మీఁదకుతికి నెత్తి మీఁద మోది
పెదవులదరునట్లు పెద్ద కేకలు వెట్టి
జీవనంబు నీయ సిద్ధమాయె॥

ఇఁక లేదాశ. (దోసిలియొగ్గి విన్నబోయినముఖముతో)

క॥ భూతమ ! కొట్టకు కొట్టకు
నేతినిలడ్డూలు నంచి నీకర్పింతున్
మాతనొకసారి చూడఁగ
నీతఁడె బోనిమ్ము వెనుకనింకెటులయినన్॥

(అని లేచి పోఁబోఁగాఁ గొండఱుపట్టికూలవైచి) నారు

దుర్యో- రాధేయ ! నీవుగదుఁజాలుపఁ బుద్ధి గలాఁడవు ఈమాయయేమో యోచింప వుగదా !

క॥ తేఁపకుఁ దేఁపకు లక్ష్మణుఁ
డీపగిదిని వెట్టియెత్తియేడ్చెడునిదియే
పాపము ! తెలియదు యీచెలి
రూపము వీక్షింపనిందు రుచిగలదయ్యెన్ ॥

కర్ణ- (లేచి లక్ష్మణుని కన్నులు నీటితోఁ గడిగి) ఈసారి సావధానముగాఁ జూడుము నాయనా ! (అని పెండ్లికొడుకు మోము బలవంతముగా పెండ్లికూఁతు వైపు త్రిప్పుచున్నాఁడు)

లక్ష్మ- (గట్టిగాఁ జేతులు రెండును గన్నులపైనొక్కి కొని బిగబట్టుకొని యంఘుడవలెఁ గూరుచున్నాఁడు)

కర్ణ- (కోపహాసములతో) ఓయి లక్ష్మణ ! ఏమినీయవలక్షణములు.

మ॥ ప్రమదారత్నము చంద్ర రేఖయిటులం బ్రాప్తింపఁ గాదానినీ
వమరం జేకొనకిట్లు మూఖ క్షమతివై హాస్యాస్పదంబౌనటు
ల్విముఖత్వంబునఁ గొండముచ్చనియొడా వెఱ్ఱెత్తెఁబో! కాకయా
కమలాకాంత వరించి రాఁగఁ దనమోకాలొడ్డువాఁడుండునే॥

గీ॥ మందభాగ్యుఁడనీకిట్టిమగువ నొరకఁ

ప్రాప్తమున్నదెపోయెఁబోపాపకర్మ
తగుదుమన మేమునీతోడఁ దఱలిరాఁగ
మాకుఁగూడను సిగ్గయ్యెమాటలేల॥

హరి- (లక్ష్మణునిగడ్డముపట్టుకొని యనునయభావముతో) నాయనా ఇంకనొక్కసారి మాత్రము స్తిమితముగాఁ జూచివిడుపుము. ఇఁక జూడనవద్దులే. (బలవంతముగాఁ గన్నులువిప్పి ముఖము చిన్నదానివంకఁ ద్రిప్పుచున్నాఁడు).

లక్ష్మ- (ఎట్టకేలకు మొండిధైర్యము తెచ్చిపెట్టుకొని చూచి యెగిరి వెల్లికిలఁబడి కనుఱెప్పలల్లార్చుచుఁ జేతులుజోడించి)

సీ॥ ఇప్పుడుమీకేమి యొగ్గొనర్చితినయ్య యీరీతినన్నలయించుటకును
పుట్టినదాదిగాఁ గట్టిగామాటైన నేరువనాచేయు నేరమేమి
అయ్యయోయిదియేటి తొయ్యలి మీరేఁ గనులజూడరుచేసి గంప్రతనము
కటయుగమదరంగఁ గనులెఱ్ఱజేయుచు హుంకారవమున మీఁదికుతికిఁ చీల్చె

గీ॥ దేహమంతయురక్తప్రవాహమయ్యె
ప్రాణములుకంఠగతమయ్యె బాబులార
(నలుదెసలఁ జూచుచు దీనస్వరముతో)
తల్లిగోయిట్లునేను వెతల్పడంగ
గర్భపుంజేపినీకైనఁ గరుణరాదే॥

తనలో) ఆహా! ఎంతగతి సంభవించినది దైవమా! చిన్ననాటనుండియు నన్నతి ప్రేమతోఁ బెంచువీరందఱు నాకిట్టిప్రాణ హంతకులయ్యెద రనుకొనలేదుగదా. హా! దుర్వార దైవదుర్విలాసము! ఇదికలయా? లేక యేదయినస్వప్నమా కాదుకాదు ఇదంతయు నాపురాకృత కర్మము. ఎచ్చటికైనఁ బారిపోవుదమన్నను కఠినాత్ములగు వీరందఱు నొక్కుమ్మడి నన్నుఁబట్టి కాలవేయుచున్నారు బ్రహ్మపెట్టిన యీయువ యింతటితో సరికాఁబోలు నెవరితరము? ఇఁకఁ జావు నిక్కంబ కానిమ్ము ఇప్పుడుదీనరక్షకుఁ డగు భగవంతుని ధ్యానించుచుఁ బ్రాణముల విడువవలెను ఇదియిహపరసాధకముగదా.

(ఆపత్సమయమునందైన నిరాళ్బ్రహ్మానుసంధానముతో)

ఉ॥ శ్రీకరుణాకటాక్ష సుగుణోదధి! యోశరణాధిశాలి! హా

హా కమలాక్ష! యోవరద! యో దనుజాంతక! శేషశాయి! న
న్నిక్రియఁ జంపుచుండిరల దృష్టజలేచర ఘోరపీడితం
బాకరిరాజుఁ బ్రోచినక్రియం బరిరక్షణ సేయవే హరీ!॥

కృష్ణు- (సాత్యకితో రహస్యముగా) తమ్ముఁడ! పాపమీకుఱ్ఱఁడు తనలో నిశ్చలముగా నను శరణు వేఁడుచున్నాఁడు కావున వీనికవ్వలకుఁ బోఁ జాలినంతశక్తి నొసఁగెదను చూచుచుండుము.

సాత్యకి- చిత్తము స్వామీ!

లక్ష్మ- (అంతట దయాసాగరుఁడైన హరికృపచేఁ గ్రొత్తబలము రాఁగా చివాలున లేచి తానుగూర్చుండియున్న పెండ్లిపీఁట జేతులతో బైకెత్తి)

క॥ మీరలు నాకిఁక నెక్కడి
కూరిమి బంధుగులు మీకుఁ గోమలికినమ
స్కారము నే నేగెదనా
కేరైనను నడ్డురాఁగ నిదె పొలియింతున్ ॥

నాప్రాణములు దక్కించుకొని నే నేగెదను. మీ పెండ్లియు గిండ్లియు నాకేల బ్రతికియుండిన నింత బలుసాకైన నెక్కి జీవించువాఁడ (అని యడ్డువచ్చినవారిఁ బీఁటతో మోఁదియు ఱక్కియుఁ గఱచియు నెట్టి కేలకు వెలపలఁబడి యాఁడువాండ్రగుంపులో దూరినాఁడు.)

శశి- (గుండెలు పగులునట్లొక్క బొబ్బవెట్టి యంతర్ధానమైనది-) (అందఱు కలవిలఁబడుచున్నారు.)

(తెరలో) హా! వల్లభులార! ఇప్పుడుద్భవించిన పిడుగువంటి ధ్వనితో నందఱము గజిబిజియగుచుండ మీఁదు మిక్కిలి మావస్త్రములన్నియు వికృతరూపములను బొందుచున్నవి. ఇవెవ్వియో మాయబట్టలు, కనుక నేవాఁడు పాఁతగుడ్డలకుఁ గ్రొత్తవస్త్రము లిచ్చినాఁడు. మేమప్పుడ యనుమానపడినారము. అయ్యో! ‹‹అత్యాశాపరమందుఃఖ›› మనుసామెత నిజమైనది. ఇదెక్కడి పెండ్లి దైవమా!

బల- సుయోధన! ఏమియీవింత? వింటివా రాణీవాసవాక్యములు! ఎంతకలిసంభవించినది!

దుర్యో- (వస్త్రములకై ఱ కేఁపురమునకైన నంచుటౌతులఁ బంపించవలెను. సేవకా! ద్వారి

తముగా నెచ్చటికైనను బోయి చాలినన్నివస్త్రములను దెమ్ము.

సేవ- చిత్తము. (నిష్క్రమించెను.)

కృష్ణు- (రహస్యముగా) సాత్యకీ! మనమిఁకనిచటఁ దడవుమసలవలదు. పోవుదమురమ్ము.

(ఉభయులునిష్క్రమించిరి.)

(అంతరిక్షమున)

క॥ కన్యాదానార్హుండభి
మన్యుఁడు మేనల్లుఁడుండ మఱియొకరికిన్
కన్యను బెండిలి జేసెడు
నన్యాయముఫలముగుడుపకట్టులెపోనే ॥

క॥ పాపము! కానలనుండఁగ
నోఁపకసోదరుఁడవంచు నూహించియునీ
పాపునకురాఁ జెల్లెలిఁ
గోపావేశమునఁ దిట్టఁగూడునెనీకున్ ॥

కావున.

గీ॥ సీరసాధనవినుమొక్కచిటికెలోన
బంధుబృందముతోడనీభవనమిపుడు
నీటఁగలిపెదనింకేటిమాటగలదు
నీదురురాజుగిరురాజునేలఁగూల॥

(తెరలో)

ఉ॥ పాములువృశ్చికంబులును బంకముఁగోమయమత్స్యసహ్యమా
-చీమునురక్తమాంస పరిషిక్తపురీషముతాతిబండలున్
జీమలుజెట్లులుందనువు జీల్చుచునుంచెడుఁ గష్టవార్ధినో
సామజరక్షకా! వరద! సత్వరనీకృపఁజూపిబ్రోవవే॥

బలరామాదులందఱును- అయ్యయ్యో! మనపై బట్టలుగూడ మెల్లమెల్లగా నెగిరిపోవుచు
న్నవే? ఇదియేమిపాపము.

(తెరలో)

అహాహా! మమ్మొక్కరొక్కరికొక్కొక్కభూతమువంతునఁబట్టి పీడించుచున్నవి

దేహమునవస్త్రములేవు తేళ్ళను జెఱ్ఱులను దొడ్డలవలెకెక్కి- కుట్టుచున్నవి వస్త్రములకుఁ బోయినవారి నెవ్వరో త్రోవలోనకడతేర్చిరఁట మాకర్మమిటులయినది.

—(*)అంతరిక్షమున.(*)—

గీ॥ ఓరి కురుకులపాంసన! యోరిమూర్ఖ
పాచికలు గావు రాజ్యంబు దోఁచికొనఁగ
నొక్కనిముసము నీవిటనుంటివేని
నాత్మజునకేమి గాని నీకగును పెండ్లి।

(తెరలో)

„రామరామ! ప్రళయకాలమునాఁడు వోలెఁ గాఱుచీకటులు గ్రమ్మ ఘోరాకారమగు వనగహ్వరములు జెలఓకొని యనేకదుష్టమృగములుత్పన్నములై బాధించుచుఁ బైనుండి ఱాళ్ళను బెంకులును బడుచున్నవిగదా! ఏమిబుద్ధి?„

అందఱును- తొందరపడకుఁడు మేమువచ్చుచున్నాము.

దుర్యో- ఎంతసిగ్గుపాటు! ।మనమిట్లూరకుండిన నిలువలేము ఓహో కౌరవయోధులార ?
కర్ణా ధనుర్ధారులమై యాపాపాత్ములఖండింతమురండు.

(అందఱుధనుర్ధారులై నిష్క్రమించిరి.)

ఇది పంచమాంకము.

శ్రీ

# బలిజా సౌభద్రీయము.



## షష్ఠాంకము.

రంగము ద్వారకాపురపు నీరాటపు రేవు.

(ఇద్దఱుపుర స్త్రీలు బిందెలు భుజములపైఁ బెట్టుకొని ప్రవేశించుచున్నారు)

ప్రథమ- (చెవియొగ్గి విని) ఓసీ! పెండ్లివారింట నేదో పెద్దరొదగానున్న దేమే!

ద్వితీయ- నీ వెఱుఁగ నేయెరుగవా? ఇదివఱకుజరిగిన దెంతచిత్రమొ!!

ప్రథమ- నేనుమా బంధుగులింటఁ బెండ్లికి వెళ్ళియిప్పుడ వచ్చినాను. శశిరేఖకుఁ బెండిలి యగు ననిమాత్రము విన్నా (అధోక్తియందప్పుడు పెద్దపులుల బారొకటి యట్టుల బెదబెద పరుగెత్తిపోఁగాఁ జూచి భయభ్రాంతచిత్తయై సొమ్మసిల్లి. అయ్యో! ఇదేమి? ఎప్పుడు నెఱుఁగని యీ దుష్టమృగములు?

ద్వితీయ- ఇదే శశిరేఖ పెండ్లి.

ప్రథ- మూఢురాల! నాతో నీ పరిహాస్యమఁటే?

ద్వితీ- కాదే. నిశ్చయమే.

ప్రథ- పెండ్లివారివి కూడఁ దెచ్చినారా యేమి.

ద్వితీ- (ఎంతో విచారము గల గద్గదస్వరముతో) అవునమ్మా. నీంద్రజాలమున నేయివి వచ్చినవి. ఈ యవలక్షణపుఁ బెండ్లివారెచ్చట దాఁపరించిరో కాని మావాంఛ క్రొత్తయల్లుఁడు మనుగుడుపునకు వచ్చి వీధిలో నిలుచుండగా పెద్దపెద్ద రాళ్ళవర్షము లెవరిసినలిగిపోయినాడు (పైఁటకొంగుతోఁ గన్నీళ్లు దుడిచికొనుచున్నది)

(అప్పుడుమఱి యొక సుందరి ప్రవేశించుచున్నది)

తృతీ- అమ్మలార! మీరు చెప్పుకొనునది శశిరేఖ పెండ్లిమాట లేగద!

ద్వితీ- అవునమా.

తృతీ- అయ్యో! అక్కా! నిన్నమావారును బెద్దపాయి నెత్తిమీఁదబడి చచ్చువారేసుమీ! ఇంకను నా సూత్రపు బలిమిగట్టిగానున్నది గనుక నంగుళమాత్రము దాటినది. కాని, మాయావు మాత్రము ఎచ్చటను గానరాకున్నది. ఏదో పులి వేసికొనిపోయినది కాఁబోలును (కన్నీరురాల్చుచు) అయ్యో! కంచెఁడు పాలిచ్చుచున్నదమ్మా? నీళ్లతో డుకొనిపోవుచున్నది

ద్వితీ- పాపము! శశిరేఖ యేమయినదో తెలియుట లేదఁట.

ప్రథమ- సఖీ! శశిరేఖ కనఁబడలేదనఁగా నాకు మిన్ను మీఁదబడినట్లున్నది. నాకు మంచి స్నేహితురాలుసుమా. ఈమాట వినినప్పటినుండియు నాకేమిఁయుదోఁచుటలేదు కాఁబట్టి యొక్కసారి మనము పెండ్లివారింటికిఁ బోయి చూచివత్తమా?

ద్వితీ- సరిసరి! అచ్చటికి మనము పోయి మరలఁ బ్రాణములతో రాఁగలమా?

ప్రథమ-అట్లు కాదు నేనుగూడనున్నాను గనుక నవి మనజోలికి రావు నేను కృష్ణుని పరిచారికనని యెఱుగుదువుగదా. మీదు మిక్కిలి శశిరేఖ ప్రాణస్నేహితురాలను, కానా? ఈ సంగతి యేమి జరుగుచున్నదో చూచిరమ్మని రుక్మిణి నన్నంపినది. ఒక్కసారి చూచివత్తమురా?

ఇద్దఱును-బిందెలక్కడదింపి నడిచి పెండ్లివారిల్లు సమీపించినారు

(తెరలో) పెద్దకలకలము.

ద్వితీయ. ఔరా! కౌరవయాదవులెంత లేసి కష్టములు బొందుచున్నారు! అమ్మయ్యో! నే నురాను- ఆలోపలికి మనముపోవుట. యమద్వారము సొచ్చుటలాగున్నది.

ప్రథ- ఓసి భీరురాల! భయము లేదురమ్ము (ముందుచూచి) ఓహోహో! బలరాముఁడిట్లు నేవచ్చుచున్నాఁడు ఆయన ముఖమెంత దైన్యమును సూచించుచున్నదో మనమాయన కుఁ గానఁబడకుండ లోపలఁ బ్రవేశింతము రమ్ము. (ఉభయులును తొందరతో నిష్క్ర మించిరి) (ఇది విష్కంభము)

(అప్పుడు నిరుత్సాహుఁడై విన్నఁబోయిన ముఖముతో బలరాముఁడు ప్రవేశించు చున్నాఁడు)

బల- (ఆకాశము వైపు తలయెత్తి) దైవమా! ఎంత కష్టము దెచ్చిపెట్టితివి! ఈ విపత్సముద్రము నెట్లు దాటుదును? (తలపంకించి) ఈ మాయయంతయుఁ గృష్ణునకుఁ దెలి యకమానదు. ఈ విషయములోఁ దాను తటస్థుఁడై యేయున్నాఁడు. (ప్రక్క

కుఁ జూచి) సేవకా! కృష్ణునిని సాత్యకిని నేను రమ్మంటినని చెప్పుము.

సేవ- చిత్తము. (నిష్క్రమించెను.)

(అప్పుడు సేవకుని వెంటఁ గృష్ణుఁడును సాత్యకియుఁ బ్రవేశించుచున్నారు)

బల- (ఆతురముతోఁ గృష్ణునిఁ గౌఁగలించుకొని) తమ్ముఁడా?

మ॥ అకటా! యేమని దూరువాఁడనిను గృష్ణా యిట్లు నేనొంటిమై
బ్రకటారాతికృతప్రతారణభయభ్రాంతుండనై యుండనిం
తకఠోరత్వము బూనఁ దిన్న నవనీతంబంత నేమయ్యె! కెం
తకు రాకుంటివి కేమి చెప్పుదును నానాదిక్కులం జూడఁ గా
నొకచో దుష్టులు కొండముచ్చులెలుగుల్ వ్యూహంబులై నిల్వనీ
యక చెంపల్ పగలంగఁ గొట్ట నొకచో వ్యాళంబు లాక్రమ్మడిం
బ్రకరాళార్భటులుప్పతిల్లఁ దమజిహ్వల్ సాచి బాధింపవే
యొకచో జెఱ్ఱులు వృశ్చికంబులును దాముత్సంగదేశంబులె
క్కి కుఠారంబులఁ జీల్చినట్లు తమకోర్కుల్ దీఱఁ గుట్టంగనిం
కొకచో వ్యాఘ్రమృగేంద్రసంఘములు భూద్యోలోకముల్ తేఁపతే
పకుఘూర్ణిల్లఁగఁ గాండ్రు కాడ్రుమని బొబ్బల్వెట్టనిట్టట్టుదోఁ
చకవీధింబడ నంతకంబెఁ దఱచై చటాత్రిశ్యను స్మాత్రమాం
సకబంధాస్థికశుక్లశోణి తమలాసారంబులాకాశమూ
డినలోకంబునఁ గూలినట్లు గుఱిరసక్ డీల్పోయి యిట్లుంటివో
వికచాంభోరుహనేత్ర వీఁడెవఁడో యీవృత్తాంత మేమో వెసన్
సకలంబున్వినిపించి పోవఁగదవే సంకోచమింకేటికిన్॥

కృష్ణు- (ఏమియుఁ దెలియనివానిబోలె నూరకున్నవాఁడు)

బల- ఓయీ! క॥ ఇత్తతి మేమిటు వెతలం
దత్తరపడుచుండ నట్టె తప్పించుకకిం
చిత్తైనఁ జింత సేయవు
మెత్తురె లోకులిది విన్న మేదినిఁ గృష్ణా॥

కృష్ణు- (కొంతకోపమును గొంతచిఱునగవును మొగంబునకు వన్నె పెట్టఁ గొంకొంకఁ జూచుచు)

ఉ॥ లోకులు మెచ్చరంచు నను లోపము లెంచుట కేమిలోటు జ్యో
త్స్నాకరతుల్యవక్త్రిసహజా ప్రియపుత్రుఁ బ్రదానపాత్రి నా,
నాకపపౌత్రసద్గుణగణప్రతిభాసుచరిత్రుఁ బార్థజుం
బోకడ బెట్టితు మ్మనసుఁ బుత్రికనీయఁగ నుద్యమింప నే
లోకులు నిన్ను మెచ్చిరొకొ లోకులు వారలె నన్ను మెచ్చగన్

బల- (తలపంకించి) క్షతముపై క్షారము బెట్టినట్లు నాయిప్పటియవస్థకు మఱింత వేదనము గలుగఁజేయుటకు నిన్ను బిలువనంపలేదోయి నీకేమైన నీవిషయములో దెలిసియుండిన వినిపింపుము కాని నాఁడు మఱియు సంతోషము.

కృష్ణ- సరే! నాకుఁ దెలిసినంత నేను జెప్పెద వినుము. నీవాడినకఠినోక్తులనుఁ గని యభిమన్యుఁడర్ధరాత్రివేళఁ దనతల్లి నిదోడ్కాని తనపితృజనముకడకుం బోవుటకై మహారణ్యముల్లఁ బడిపోవుచుఁ గాలవశముచే భీమపుత్రుఁడగు ఘటోత్కచుని యాశ్రమముఁ జేరినాఁడు అచ్చట వారివురకును ఘోరయుద్ధమయినది- అప్పుడు వేదవ్యాసుఁడు ప్రత్యక్షమైవారిద్దఱకుఁగల బంధుత్వమును శ్రుతపఱచిపోయినాఁడు.

బల- (తనలో) అయ్యో! ఈసన్యాసి వ్యాసుఁడేలదాఁపరించినాఁడో! వీఁడు రాకుండినఁ గడుజక్కగానుండి పోవునుగదా! పిట్టతగవు పిల్లిదీర్చినట్లుగానయియుండును సరే విధియిట్లున్నది- (పైకి) తరువాత-

కృష్ణ- అటుపై నివారిద్దఱును సఖ్యపడినంతట ఘటోత్కచుఁడు వారినరణ్యాగమనకారణమడుగ నభిమన్యుఁడీసంగతి యంతయుఁ జెప్పినాఁడు- అప్పుడు వాఁడు మహోగ్రమగు క్రోధావేశంబున నాక్షణంబ యంబరవీధినిఁవచ్చి తనమాయచే శశిరేఖ నెత్తుకపోయి యచ్చట డించి వెండియుఁ దావచ్చి మాయాశశిరేఖయై పవ్వళించి యున్నాఁడు పెండ్లికొడుకునిన్నిపాట్లుపెట్టి తుదకిప్పటికినివిడువకున్నాఁడు- అదిగావున్న [illegible]

గీ॥ ఎఱిఁగి చేఁ జేతఁ జేసినయట్టి పనులు
తగుఫలంబులఁ గుడుపక తప్పిపోనె?
చెల్లెలిని కాఱులాడిని శీథమున్నను
వనములకుఁ దోలనింతే సిపసులుపుట్టె॥

బల- నేను శశిరేఖనీయనంటిని గాని యర్ధరాత్రివేళ నడవులకుఁ బొమ్మనలేదుగా- వృథా

పాండవులకుఁ దెలియకమానదు. అనంతరము,

క॥ నూనాస్త్రుఁడైనపార్థుం
డీనినపులివోలెవచ్చి యెంతయుమనలం
బ్రాణంబులతోనింటికి
రానిచ్చునెనీకువట్టి భ్రమలింకేలా ॥

(అదియునుంగాక)

సీ॥ పందికైపోరిఫాలాక్షునోడించిపాశుపతముగొన్నబల్లిదుఁడు
ఆఖాండవంబేచియగ్నిహోత్రుబుభుక్షసంతృప్తిజేసినశస్త్రవిదుఁడు
కాలకేయనివాతకవచులఘనపరాక్రములనిర్జించినఘనబలుండు
శరణాగతత్రాణనిరతుఁడాఖండలనందనుఁడఖిలలోకసుందరుండు
నామదశకంబుచేకొన్నశ్రీమహితుఁడు
శత్రుజలధరసంఘఝంఝాసమీరుఁ
డార్తరక్షణపరుఁడచ్ఛకీర్తిధరుఁడు
పార్థుఁబోలంగఁగలరెయీవసుధనొరులు॥

అట్టిమహాభాగుండగు పార్థునివిడనాడి తుచ్ఛుఁడగు దుర్యోధనుఁ జేకొనుట మత్తేభకుంభతట ఘనమాంసలంపటంబగు మృగేంద్రమును గేలిసేసి తెగులుగొంటినక్కను చేకొన్నట్లయినది కంటె?

బల- (తనలో) అయ్యో! నేను వెనుకనతనియెదుటఁ గౌరవులనెంతయుస్తుతించి పాండవులదూతినాఁడను. దానికిప్పుడునన్నితండు దెప్పిపొడుచుచున్నాఁడు. ఏమి సేయుదును. కోపమునకిప్పుడు సమయముగాదు. సామము సర్వార్థ సాధనముగదా కనుక నేనిప్పుడిట్టుల నటించెదను. (పైకి) అవును! కృష్ణా! గతజలసేతుబంధనము నఁగార్యమేమి? తప్పకనాకూఁతును సౌభద్రునకిచ్చెదను. కావుననీయిష్టము వచ్చినట్లుచేసి యీయిడుములఁబాపుము.

(కొంచెమాలోచించి) సరే! ఈవాక్యమువంధ్యముగుఁగాక

(ఆకాశముజూచుచు)

గీ॥ ఓయిహైడింబమెచ్చితినీయసాధ్య
బాహుబలమునకెంతేయుఁ బార్థుఁ జున్నఁ

గూఁతునిచ్చెదు మాయన్న కూర్మి మీఱ
చలము సాధించి నావిఁకఁ జాలురమ్ము॥

(అంతరిక్షమున)

మత్తకోకిల॥ దీనలోకశరణ్య కేశవ దేవదేవ దయానిధే
శ్రీనివాస జనార్దనా హృదయాబ్జ [illegible]
కానివాఁడె సెనక్కు [illegible]
బూనియుండఁగ నెట్లు రాఁ దిబుద్ధి పుట్టును మాధవా॥

కృష్ణ- (బలరామునివైపు చూచుచున్నాఁడు)

బల- (తలపైకెత్తి)

గీ॥ ఓయి హైడింబ మెచ్చితి నీయసాధ్య
బాహుబలమునకెంతయుఁ బాధఁజెనకుఁ
గూఁతునిచ్చెదనిఁక నీదుకోపముడిఁచి
చలము సాధింపఁబడెనిఁకఁ జాలురమ్ము॥

క॥ పురజనులు బంధుజనులును
గరమున నంజెప్పరాని కాఁకుల నిందిం
చిరి వచ్చిన బందుగులను
మరియాదగ నింతతోనె మరలఁగనిమ్మా॥

(అంతరిక్షమున)

మామా! నీవాక్యములు నాహృదయంగమములైనవి. కాని, నాతోడనీవు సఖ్యము గావలయు నేనియిప్పుడ యీ గౌరవవంతులగు కౌరవోత్తములనూరు వెడలఁగొట్టింపుమా.

బల- (అటునిటుచూచుచున్నాఁడు)

సాత్యకి- (రభసముతో లేచి) ఆపని నాది. అన్నా! నన్నుఁబంపుము. (నిష్క్రమించెను)

(తెరలో) ద్విపద॥ ఓరి దుర్యోధనయోరి సౌబలుఁడ
యోరి దుశ్శాసనయోరి బాహ్లీక
యోరి జయద్రథయోరి రాధేయ
యోరి ద్రోణతనూజయోరి నృపసేన

పూర్వసువాసినీపుంజంబువోలె
గర్వమంతయుఁ బోసిగాసిలియిట్లు
మాయూరిపంచల్రమగ్గంగ నేల
నాయువుమీకు లెస్సయ్యెఁ బోపొండు
జీవించి మీరిండ్లఁ జేరుఁడే మీకు
నే వేలు శశిరేఖ పెండ్లికే మాయె
తాఁ జెడ్డకోఁతికాంతారము సెల్ల
నోఁజవక్కఁగధ్వంసమొనరించునట్లు
మీరు సేరినచోట మేలేలగలుగు
దారుణనిర్ధూమధామమైపోదె
కరుణించిమావాఁడు కడద్రోలుమనియెఁ
బరువెత్తుఁడిదె సందుపాపాత్ములార॥

బల- (తనలో) అయ్యో! సాత్యకి తనకోపమునంతయుఁ దీర్చుకొనుచున్నాఁడుగదా.

సాత్యకి- (ఉత్సాహముతో మరలఁ బ్రవేశించి) అన్నా! మనవారప్పుడే హస్తినాపురినిది రిగిచూతురుసుమా! పాపము! ఈపూటతిండియైనలేదు.

ఘటోత్కచుఁడు- (నిజరూపముతోఁ బ్రవేశించి) మామలార! వందనము. (రామకృష్ణుల కుసాష్టాంగముపడినాఁడు)

బల- నాయనా! నీవే నాయింతవిద్యచేసితివి? చాలసంతోషించితిని.

కృష్ణు- వత్స! పెద్దలయెడనింతయనాజ్ఞాపముకూడునటోయి!

ఘటో- మామా! మేనమామబిడ్డయందల్లునకుఁగల స్వాతంత్ర్యమునకు మించుతప్పు నేఁజేయలేదు. నన్నుమన్నించవలెను.

బల- భీమపుత్ర! సరే! త్వరగా శశిరేఖాభిమన్యులనుబిలిపించి నాకూఁతునునాకంటఁజూపుము నాయనా!

ఘటో- మీరునాయాశ్రమమెప్పుడుచూతురు? మీరందఱుదయచేసి సుభద్ర నొప్పించి యందఱను వెంటఁగొని రావలయునని నాకోరిక.

కృష్ణు- అన్నా! అట్లేచేయుదము.

బల- సరే! మీయిష్టము మీరెట్లుచెప్పిననట్లే

(అందఱు నిష్క్రమించిరి)

ఇదిషష్ఠాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## సప్తమాంకము.

రంగము ఘటోత్కచాశ్రమము.

—*వనమలంకరించుచుసిద్ధులుపరిచారకులుప్రవేశించుచున్నారు.*—

ప్రధ- కరిబలా ! ఏమింత తొందరతోడి యుత్సాహముతో వనమలంకరించుచుంటివి.

కరి- సఖా ! దీర్ఘదంష్ట్ర ! ద్వారకాపురమునుండి మాఘటోత్కచుడును శ్రీకృష్ణుడును బలరాముడును లోనగువారు మనవనమునకీదినమున వచ్చెదరు. మాప్రభువుగారు ముందున నెఱిగి వనమలంకరింపుమని చెప్పినందున నట్లుచేయుచుంటిని యారంభము.

దీర్ఘ- ఇప్పుడువారందఱును వచ్చి యేమిచేసెదరు ?

కరి- సుభద్రాభిమన్యులను శశిరేఖను ద్వారకకుఁ దోడ్కొనిపోయి యచ్చట శశిరేఖాభిమన్యులకుఁ బరిణయము సేసెదరఁట.

దీర్ఘ- అయ్యో ! చెడితిని ! చెడితిని !! ఇక్కడ వివాహమునకైనఁ గడుపునిండ నిచ్చుదీఆ మెక్కవచ్చుననియు వేచియున్న నాకీయపకారము చేసినవారెవరో వాండ్రకడుపు!

కరి- ఛీ ! నిర్భాగ్యుఁడ ! నోరుమూసికొనుము. మనరాజుగారితో ద్వారకకు మనము మాత్రము వెళ్ళమనుకొన్నావురా !

దీర్ఘ- (పట్టరాని సంతోషముతో) నాయనా ! నీకడుపుచల్లగా నన్ను బ్రతికించినావోయి ! (కౌఁగలించుకొనుచున్నాఁడు)

(తెరలో)

ఎవరక్కడ ? ఇంద్రాదులు వచ్చుచున్నారు. పొండు.

(ఉభయులునిష్క్రమించిరి.)

ఇదివిష్కంభము.

(అప్పుడింద్రాదులు ప్రవేశించుచున్నారు)

ఇంద్రు- నారదగురువర్య ! మనమువచ్చి కడుఁదడవాయె. ఘటోత్కచుఁడు మనలఁగా! ర్యారంభము సేయుచుండుఁడని తాఁజని యింకయు రాలేదు.

నారదు-(ప్రక్కకుచూచి) అదిగో ! మాటలోనే వచ్చుచున్నాఁడు తానొక్కఁడేకా క బలరామాదులను గూడ లాగికొని వచ్చుచున్నాఁడు ! బలరామునికిఁ దిక్కు తోఁచినది కాఁబోలును !

(బలరామ, శ్రీకృష్ణ, ఘటోత్కచులును మఱికొందఱును ప్రవేశించుచున్నారు.)

దేవేం. అయ్యా ! మీరందఱు యాసనములఁదయసేయుఁడు.

అందఱు- (కూరుచున్నారు)

కృష్ణ- దేవరాజ ! ఈతీర్థమున నిన్నుఁజూడఁ గల్గితినిగదా !

దేవేం- దేవాదిదేవ ! మీరు సర్వదా మమ్ములను వేయికన్నులతోఁ జూచుచు నేయున్నారు. మేము నిజముగా వేయికన్నులుండినను మిమ్మును గనుఁగొన శక్తులము గాము. నాయదృష్టవశముచే మీదర్శనములభించి కృతార్థుఁడనైనాను. (సాష్టాంగము జేయుచున్నాఁడు)

కృష్ణ- (ఇంద్రునిఁ జేతులతో నాదరముగా లేవనెత్తి) ఘటోత్కచునితో సాయనా హైడింబ ! మరమాలస్యము చేయరాదు. సత్వరముగా సుభద్రాభిమన్యులను శశిరేఖను మఱియు నీతల్లి మొదలగు బంధువర్గమును రావించి శీఘ్రముగాఁ బ్రయాణము సాగింపుము.

ఘటో- చిత్తము ! సేవక ! మనవారినందఱను బ్రయాణముచేసిరావింపుము.

సేవ- మహాప్రసాదము ! (నిష్క్రమించెను)

సుభద్ర- (ప్రవేశించి( అన్న ! వాసుదేవ ! మీకుమీచెల్లెలునమస్కరించుచున్నది)

కృష్ణ- అమ్మా ! మనోరథ సిద్ధియగుఁగాక. మనయన్న గారిదిగో నిన్నుఁదోడ్కొని పోవచ్చినారు !

సుభ- (విస్మయమును నటించి( ఔర !

సుగంధి॥ కోఁడుగుడ్డలైనలేక కుంచుచిట్లుకావల్లం

పాదములనంటికొనుభంగి సాదరమున ॥

(అప్పుడు, శశిరేఖాభిమన్యులును హిడింబయుఁ బ్రవేశించుచున్నారు)

శశిరేఖాభిమన్యులు- (అందఱకు నమస్కరించుచున్నారు)

అందఱును- త్వరగాదంపతులుకండు.

బల- (శశిరేఖశిరము ముద్దాడి సబాష్పగద్గదికముగా) అమ్మా !

గీ॥ నిసురలోనిన్ను రక్కసుఁ డదిమిపట్టి

వనములకుఁ గొంచుపోవనీమనమునందు

నెంతచింతించితివొ నన్ను నెంచిచూంచి

యక్కటా ! క్రూరకర్ముఁడ నైతినిగద ॥

(కన్నీరు రాల్చుచున్నాఁడు)

శశి- (తనలో) అవును నిన్నెంచి యెంచి విచారించుచు నేయున్నానుతండ్రీ !

అందఱు- కాలవశమట్లున్నది. సీరాయుధ ! నీకుఁ దెలియనిదేమున్నది. నీవట్లుచింతింపఁ గూడదు-

కృష్ణు- మేఘువాహన ! నారదాగులతోవచ్చి మనుమనికిఁ బెండ్లిచేయింపఁగోరెదను.

దేవేం- లోకేశ ! లీలామానుష వేషివై భూలోకమున నవతరించిన యాదివిష్ణుఁడ వగు నీవునన్నాజ్ఞాపించవలసియుండఁగాఁ గోరెదనన నేల ? (ప్రక్కకుఁజూచి) సేవక మాతలిని రథమాయిత్తముచేయుమనుము.

సేవ- చిత్తము (నిష్క్రమించెను)

మాతలి- (రథసహితుఁడై ప్రవేశించుచున్నాఁడు)

ఘటో- పూజ్యులార ! రథము సిద్ధముగానున్నది. మీరందఱునధిష్టించుటయే.

అందఱు-(రథమెక్కిరి)

సారథి- (రథమతివేగముతోఁ దోలుచున్నాఁడు)

ఘటో- వాసుదేవ ! ఈయారంభమంతయు మీయాజ్ఞను బొందకయే చేసితినని నాకుది గులుగలుగుచున్నది.

కృ- వత్స !

॥ దిగులదియేలనోయసుర ధీరమనంబుననన్నెయెంచుచు

త్యగణితవాయువేగముననంబరవీథిని నాటిరేయినీ

మవ్వపు బంగారు మెట్లు మాడ్కినినాభిక్ ॥

క॥ మృగములకుఁ జగలిగినఁ
దగనీచెలి వేణిఁ జూచి తప్పకచమరీ
మృగములుతమవాలంబులఁ
బగతోనీక్షించిప్రియము వాయవెతలఁపన్ ॥

క॥ సుందరమరాళగతిసొగ
సుందరిఁ జేరంగనీవు సుందరినడకల్
మందరగిరిధిక్కృతకుచఁ
గుందరదన సెన్న బ్రహ్మకుందరమగునే ॥

(తలపంకించి) విస్తారమేల ? సర్వోపమానవస్తుసమాహారమొక్కచో యథాస్థానముఁ బొందినదిమచ్చులాపఁ గోరి విధాతయీ మెస్సృజింపఁ బోలు !

ఉ॥ ఖ్యాతిగముత్తెపుంజడులఁ గాంతుని దేహముముంపఁ బూనితాఁ
గౌతుకమొప్పముత్యములఁ గాంతమనోహరరక్తవర్ణహా
చేతధరింపనెట్టనయిచిమ్మఁగఁ దల్లని వైకనంబుతుక్
నాతివిచిత్రమెంతయును నాకపజాలమువో లేఁదో చెడుక్ ॥

గీ॥ అతివప్రతికంఠజాణయొనునుచుజనులు
ముదితులై మెచ్చుమితిలేనిముత్తెములను
మీఁదజల్లంగఁగొగ్రుక్కారు మెఱుపులేచి
మౌక్తికాసారమొప్పలించుమాడ్కిఁదోఁచె॥

కానిమ్ము! మాటిమాటికిననుమీఁదఁదలఁచు నీచెలియుత్సవముఁజూడ నొక్కింత వడివేనవిరమించెదను.

రామభట్లు- (సభవైపుచూచి) అయ్యావివాహమైనది ఇఁకపూజ్యులందఱు వధూవరులనాశీర్వచింపవలెను.

అందఱు- ఆయురారోగ్యసంతత్త్యైశ్వర్యసంపత్సుప్రవర్తనాసిద్ధిరస్తు. అనియక్షతలఁ జల్లుచున్నారు.

సుభద్ర- (పరుగుపరుగునవచ్చి)

క॥ ఇంపగుపుత్రులుగలిగియు•

సొంపగు కోడండ్రతోడ సూర్యావధిగాఁ
బెంపున రాజ్యము సేయుచు
దంపతులు సుఖింతురిగా తత తసంపదతోన్॥

(అక్షతలుజల్లుచున్నది)

అందఱు- తథాస్తు.

దేవేం- వత్స! సౌభద్రి? ఇంకయు నీకేమి కావలెను?

అభి- తాత! త్రిదివస్పతీ! లోకారాధ్యుడగు మామామ శ్రీకృష్ణమూర్తియొక్కయు మీయొక్కయు ననుగ్రహముచేఁ జిరకాంక్షితయగు శశిరేఖం జేపట్టితి. మఱియు నాకోరికయిది.

క॥ స్వామియగుకృష్ణునికృపం
గామితములువడయవలయుఁ గవిసజ్జనులెం
తో మహితసుగుణవైఖరి
నీమహిరాజిల్లుఁగాఁత మీతిరహితగన్॥

దేవేం- నాయనా! సరే. ఇట్లగుగాక (భరతవాక్యము).

సీ॥ పరహింసాసహనులు, పరధనాపహరులు, పరదారగమనులు వంచకులును
కల్లకథలు జెప్పి కాసువీసములను స్తుతిజేసి లాగుదుస్సోమరులును
తెల్లని కాకియు నల్లని కొంగయుఁ గలవనను మూర్ఖవ్రజంబు
న్యాయంబు దక్కయనాథజనంబుపై దండెత్తు వీరయోధవ్రజంబు
మందుకైనను లేకుండ మణఁగి మఱియు
దయయు సత్యంబు శౌచంబు ధర్మరతియు
నీతియు నహింస, యింద్రియనిగ్రహంబు
పరజనోపకృతియుఁ గల్గి పరగునట్టి
యుత్తమోత్తములిల వెలయుదురుగాక॥

(అందఱునిష్క్రమించిరి)

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, వాధూలసగోత్ర, కస్తూరివంశ,
పవిత్రసుబ్బారాయామాత్యపుత్ర, సద్విధేయ, శివశం
కరనామధేయప్రణీతంబైన బలజాసౌభద్రీ
యము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ